నీకు గలిగె వదునను పోలిన లోహము కాంచన మైనట్లు కృష్ణమాచార్యులు విన్న చేపట్టగానె కృతార్థుండనైతి ననిన సింహాద్రిప్పలు యీమను చున్నారు దేవ! కృష్ణమాచార్యులకు యిచ్చిన వైకుంఠంబు నీకు యిద్దరికిన్ని యిచ్చితి గావయని వైకుంఠంబు అభయ మిచ్చెనె దా యీ సంకీర్తన లిఖ తల్లు లాయె నేమి, విష్ణుదాసు లాయె నేమి యెవ్వరు చదివిన యెవ్వరు భక్తితో విన్న, యెవ్వరు వ్రాసిన పాపపరిహారంబవును అటుమీదట కామంత్రి మంగున వైకుంఠం దిక్కును నీయాన నీ చరణంబు లాన మా తిరుమణి తిరుమార్గంబులాన మా గురువు లాన మా శ్రీకృష్ణకుమారస్వామి సింహగిరి నరహరి నమోనమో దయానిధీ!"

* * * *

*"దేవా! కృష్ణమాచార్యులు వోరుగంటిలో పతివ్రతాగృహంబున కేగిన ఆ యింటి బ్రాహ్మణుండు దండ ప్రణామంబు చేసి 'స్వామీ! మీరు విజయంచేసుట నా గృహంబు పావనం బాయను నేను కృతార్థుడనైతిమి మా యింట అరగించి మమ్ముల రక్షించుమని విన్నపంబుచేసిన కృష్ణమాచార్యులు యీమనుచున్నారు 'నీవు ఏక పత్నీ వ్రతుండవు విత్యాను సంధాన సంపన్నుండవు సకల గుణసంపదలు గలుగు ధన్యుండవు బృందావన మునకు విజయంచేసిన పిమ్మట మీ యింట నార గించెదననిన బ్రాహ్మణుండు తులసీమాహాత్మ్యం చెప్పు మనిన ఆ బ్రాహ్మణునకు తులసీమహాత్మ్యంబు యిట్లు చెప్పంగోణంగె విశసమయమందు తులసీ దర్శనంచేసినవారికి శిశుహత్య, గోహత్య, స్త్రీహత్య, మొదలైన పాతకంబులుపోవును తులసికిం పళఅయినా కట్టి సంరక్షణ చేసినవారికి నేయి సంవత్సరంబులు సాయుజ్యపదంబులుగలుగును తులసికి కోటచేయించి కొమ్మలు దీర్చిన పుణ్యాత్ములకు అశ్వమేధ ఫలంబు గలుగును తులసికి దీపం యిచ్చినవారికి సూర్యచంద్ర లోకంబులు గలుగును తులసికి రాగి, వెండి, బంగారం బుల ప్రాకారంబులు దీర్చిన పుణ్యాత్ములకు శాశ్వతం బుగా విష్ణులోకంబు గలుగును తులసికి నీరాజనంబు సమర్పించినవారికి బ్రహ్మలోకంబు గలుగును తులసి కోటకు గోమయంబులు దీర్చి అలికినవారికి శత సంవత్సరంబులు స్వర్గంబు గలుగును తులసికి నమస్కారంబు చేసినవారికి నాలుగులోకంబులు గలుగును తులసికి నైవేద్యంబులు సమర్పించినవారికి కామ్యంబు గలుగును నీళ్లుపోసి పెంచినవారికి జల బిందువు లెన్ని కలుగునో అన్ని సంవత్సరములు పుణ్యలోకంబులనుండి విష్ణుసాయుజ్యంబు పొందుదురు నిత్యకృత్య నమస్కారంబుచేసి పూజలు చేసినవారికి వైకుంఠంబు గల్గును. తులసికి మంత్ర పుష్పమున్ను యజ్ఞోపవీతమున్ను సమర్పించినవారికి బ్రహ్మలోకంబు గలుగును తులసికి వస్త్రములున్ను, మణులున్ను సమర్పించినవారికి స్వర్గలోకంబుగల్గును తులసియొద్ద ముగ్గు లుంచినవారికి అగ్నిష్టోమఫలంబు గల్గును తులసికి మొదట అరుగు చేసినవారికి అష్టైశ్వర్యంబులు గలుగును తులసి మొదట మృత్తిక ధరియించినవారికి లలాటలోచనుని దర్శనంబు గలుగును తులసిపూజలు అష్టాక్షరి ద్వాదశాక్షరీజపంబు చేసిన పుణ్యాత్ములకు అష్టపుత్రులు గలుగును ద్వాదశి దినంబున వైకుంఠంబు గాంతురు తులసీదళంబుల శేషశాయి పూజచేసినవారికి శంకరలోకంబు గలుగును తులసిదళాన తీర్థపానం చేసినవారికి సకల తీర్థంబులయందు గాంగాది నదులయందు స్నానంబు చేసిన ఫలంబు గలుగును దేవా! తులసీదళంబు శిరస్సున ధరించినవారు త్రిలోకాలకు అధిపతులై జన్మింతురు. ద్వాదశి దినంబున తులసీవ్రతంబు చేసిన వారు ద్వారకానగరంబున అధిపతులై జన్మింతురు తులసీబృందావనంబు అలికి ముగ్గుపెట్టి స్నానం సంధ్య జపములు దీర్చుకుని మంత్రపుష్పాంజలులు, ధూపదీప నైవేద్యంబులు సమర్పించినవారికి యింట నిత్యోత్సవ పక్షోత్సవ, మాసోత్సవ, సంవత్సరోత్సవ సంవత్సరాదులయందును సకలమైన భోగభాగ్యాదులు చంపదలు గలిగి శుభశోభనంబులు గలిగి యుందురు. తులసి బృందావనానకు నారికేళ కదళీ ఖర్జూరఫలంబులు సమర్పించినవారికి కైలాస సన్నిధానంబు గలుగును తులసి బృందావనానకు దంపతి సమేతంగాను మూడు ప్రదక్షిణంబులు చేసి సాష్టాంగ దండప్రణామంబు లాచరించినవారికి అనేక కాలా

* కాకత మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున R 447 అనుసంఖ్యతో నున్న ప్రతిలోనిది—

యందున్ను సకలమైన సంపదలు గలిగి జన్మ జన్మాల యందు ఉత్తమకులంబులయందు జన్మింతురు తులసి బృందావనమునకు భక్తిపూర్వకంబుగా యథాశక్తి తాంబూల నైవేద్యంబులు జేసినవారికి భూలోకంబు నిష్కపాలనంబు చేసి విష్ణు సన్నిధానంబు నొందుదురు సాయంకాల సమయంబులయందు తులసికి దీపంయిచ్చిన స్త్రీలకు కోరినకోరిక గలుగును తులసి బృందావనంబునకు అలికి ముగ్గు దీర్చి ఆ సాయంకాలమందు ఆరతి యిచ్చిన స్త్రీలకు శాశ్వతంబుగా అయిదవతనంబు గలుగును సంతానభాగ్య గలిగి సంతోషంబున నుందురు దేవా! అంత్యమందు తులసిదళోదకం యిస్తే దేహం పవిత్రంబై సద్గతి గలుగును దేవా! తులసీ మహాత్మ్యం పఠియించిన వారికి కొన్ని జన్మాదులు గడచిపోగాను శాశ్వతంబుగా కైలాససన్నిధానంబు గలుగును తులసీవనమందు వున్న దళం దెచ్చి శిరస్సున ధరించినవారికి త్వరితంబుగా ఆదిత్యపురంబు గలుగును ప్రొద్దున లేచి తులసి దర్శనంబు జేసిన వారికి పాపంబులు దొలగును ఈ కథ కృష్ణమాచార్యులు సంకీర్తన శాయగా వకయింట నలుగురుకోడళ్లు నీళ్ల కడవలు తీసుకువస్తూ వుండిన వేళ అయింటి పెద్ద కోడలు యీ సంకీర్తన వింటా మనెను రెండో కోడలు పూర్ణకడవలు దించుకొని విందామనెను కడమ యిద్దరుకోడళ్లు యీ సంకీర్తన కేమి యీమాటలకేమి పోదాము రమ్మనిరి కనుక యీ సంకీర్తన విందామన్న కోడలు భూమండల మేలే రాజా కొమరై జన్మించెను పూర్ణకుంభములు దించి విందామన్న కోడలు చక్రవర్తియై జన్మించెను కడమ యిద్దరు యిక్కడ సంకీర్తన వినక పోదాము రమ్మన్న కోడళ్లు అనామికులయింట నూరు జన్మంబులు పందులై జన్మించిరి కనుక యీదివ్య నామస్మరణ నొకరు వ్రాసినా, నొకరు చదివినా, యొకరు పఠించినా, నొకరు విన్నా గోసహస్రదానంబులు చేసిన ఫలంబు గలుగును పితృపితామహులు విష్ణుసాయుజ్యంబు గాంతురు సకల దోషములున్ను సర్వత్రా తా జేసినపాపములున్ను నివారణమై ఆపదలు దొలగును ఆయురారోగ్య ఐశ్వర్యంబులు గలుగును పుత్రపౌత్రాభివృద్ధి గలుగును"

* * * *

"ఏమారి రజకునియింట మృతానుఁ
నమపించె పితృకాననంబునను
నా బ్రహ్మరుద్రుల కైన గన్నపనట్టి
నృహరి నామంబెని నిత్య మెన్న
డానశాపమున సర్వపని గునిరైన
శేషహాములు కారె శిరికి"

అలాంటి కృష్ణమాచార్యులు రచించిన యీ 'తెలుగువేదం' త్వరలో ప్రకటింపబడితే అది తెలుగు వాఙ్మయానికి ఒక విశిష్టాలంకారం అవుతుంది!



# సంగంవారి వీధి



శ్రీ ఇవటూరి కామేశ్వరరావు

ఆ వూళ్లో చంగల్రావ్ హోటలుకు వచ్చే జనం ముచ్చటించని సంగతంటూ లేదు. దైనందిన వ్యవహారాలనుంచి, కాంగ్రెసు ఎలక్షనులు బ్లాకు మార్కెట్టు, సమ్మెలు—అబ్బో ఒక టేమిటి సమస్త సంగతుల గురించి ప్రస్తావించడం పరిపాటి. వూళ్లో ఏదైనా చావు సంభవిస్తే ఆ ప్రస్తావం అక్కడే.

పెళ్లిళ్లు, పేరంటాలు జరిగితే వాటి వార్తలు అక్కడికు వెంటనే చేరుకుంటాయికదా. కోర్టులో ఏదైనా మంచి కేసు విచారణకు వస్తే దాని ఫలితాలను గురించి యిక్కడే చర్చ జరిగితీరుతుందిగదా. బళ్ళో చెప్తారుగాని ఎవరికైనా సంచో పెట్టారంటే ఆ విషయం అక్కడ చర్చించుకోవలసిందే గదా. ఆ రోజు సంతలో మిరపకాయ ధర హెచ్చిందంటే దానిని గురించి అక్కడ ప్రస్తావన జరగవలసిందే. ఇలాగ్గా చిత్రవిచిత్రంగా సాగిపోతుంటాయి సంభాషణలు. చెంగల్రావు కూడా వీలత్ సంభాషణల మధ్య తనకు తోచినట్టు ఒక్కొక్క విసురుతూండం పరిపాటి.

చంగల్రావుకొట్టుకు అనుదినమూ హాజరు వేసుకునే వాళ్లలో—ఆ ప్రక్క ఫ్యాక్టరీ ఫోర్మను ఒకడూ, అగ్రహారంలో వుండే శాస్త్రులవారొకరూ, గవర్నమెంటుగ్రాంటుయిచ్చిన ఎయిడెడ్ స్కూలు అయ్యవారు, అయ్యవారమ్మగారూ ఒకయిన్స్యూరెన్సు ఏజంటు ఒకాయన వీళ్లు హాజరు కావలసిందే. అలా వర్షం కురవనీయండి—కాలా ఎండలు కుదిరి ఘాడ్పులు చేయనీయండి—ఏదో ఒక సమయంలో హాజరు వేసుకొని పిచ్చాపాటీ మాట్లాడుకొని పోతుంటారు.

తరుచు సుబ్బన్న కూడా ఆ దుకాణంకు రావడం కద్దు. మోతుబరి సుబ్బన్నంటే ఆ వూళ్ళో చాల మందికి తెలుసు. ఘరానా మనిషి. నిత్యమూ ఇతని కూడా ఇద్దరో ముగ్గురో తోకల్లా తిరుగుతూనే వుంటారు. తన మాటకు అడ్డొస్తే సహించే ఘటం కాదు. వాడితోపాటే వాడి అనుచరులు కూడా ఒకే మాట. అతనితో ఘర్షణ పడితే ఏం విపత్తు సంభవిస్తుందోనని సౌమ్యంగా పోతుంటాడు చెంగల్రావు. ఎందుకంటే వెనుక ఒకటి రెండుసార్లు అక్కడ కొట్లాటలు కూడా జరిగి తలలు పగలగొట్టుకునేంత పని జరిగింది. అందులో మోతుబరి సుబ్బన్నతో చేయి చేసుకుంటే ఆ రోజు కొత్తరు మూడారన్నమాటే.

యథావిధిగా ఫ్యాక్టరీ ఫోర్మను పోతూపోతూ తన మామూలుగా కూర్చునే బల్లమీద కూర్చుని యింత కారప్పూస తింటున్నాడు. పెట్టించుకొని గ్రాంటుస్కూలు పంతులు, అయ్యవారమ్మ బడి తలుపు బిగించుకొని రవంత యేమైనా తినిపోదామని చంగల్రావుదుకాణానికి దక్కొచ్చి ఫ్యాక్టరీ ఫోర్మను ఎదురుగుండా వున్న బల్లమీద కూర్చుని చెరొక ప్లేటు బూంది తినసాగారు.

ఫ్యాక్టరీ ఫోర్మను యుద్ధంనుంచి తిరిగివచ్చిన వ్యక్తి లావుగా పొట్టిగా ఉంటాడు. పిల్లికళ్లు జుట్టు ఎప్పుడూ ముందరకు నుదిటిమీదకు వస్తుంటే పదేపదే వెనక్కి తీసుకుంటూంటాడు. ఇన్స్యూరెన్సు ఏజంటు బక్కపలచగా పొడుగ్గా ఉంటాడు. ఇతగాడు 24 ఘంటలూ సైకిలుమీదే తిరుగుతూంటాడు. ఓ పది నిమిషాలు తీరిక చిక్కిందంటే చెంగల్రావు కొట్టులో ఉండి తీరవలసిందే. ఇహ పోతే అయ్యవారూ, అయ్యవారమ్మది ఒకే అదృష్టం. వీళ్లది అసలు దానవాయిపేటలో మకాం. మాలవాడంతా వీళ్ళంటే విపరీతమైన గురి. ఇద్దరూగూడా ట్రైనింగ్ అయినవారేమో చెరో 50 రూపాయలు సంపాదించుకుంటున్నారు. యిప్పుడంటే వుద్యోగాలు సంపాదించారుగాని, వెనుక వీళ్ళ తాత ముత్తాతలు పురపాలక సంఘంలో పీనుగులు మోసి తమ పొట్టలను వెళ్ళబోసుకునేవారు. కాని నేటి గాంధియుగంలో 'మాల' అనే పదంపోయి దాని స్థానే హరిజన అనే పేరు రావడంతోటే పరిస్థితులన్నీ మారిపోయాయి.

ఇంతకీ విషయ మేమిటంటే ప్రక్కన రెండు ఫర్లాంగుల దూరంలో ఉన్న దూపాటివారి వీధిలో బ్రాహ్మణ దొడ్డమ్మగారు ఆ క్రితం రోజు పోయారట 60 ఏండ్లుంటాయట

ఫోర్మన్ పాపం చాలా ధర్మాత్మురాలట అనేక ధర్మాలు కూడా చేసిందట

ఏమిటంటు ఆమె ఎవరినో పెంచుకుందట, అతను తాలూకాఫీసులో పనిచేస్తున్నాడట ఆ లోగిలీ 4 ఎకరాల భూమి అతగాడికి వ్రాసి యిచ్చేసిందట

అయ్యవారమ్మ ఏం జబ్బటండీ పాపం హఠాత్తుగా పోయిందట ?

ఫో గుండెజబ్బట అందులో ఈ గుండె జబ్బు చాలా విపరీతమైనటువంటిది మాట్లాడుతూ తక్షణ ప్రాణం పోవడం, పడుకుని తెల్లవారేసరికల్లా హంస లేచిపోవడం, స్నానం చేస్తూనే హరీ అంటూండడం ఈలాగా కర్దకఠోరంగా వుంటూంటాయి, ఈ గుండె జబ్బు కేసులు.

అయ్యవారు ఏ వీధిలోనండీ ఆమె నివసిస్తున్నది?

ఇ వి ఏ వీధేమిటి — (యిక్కడే దగ్గర లోనే) దూపాటివారి వీధి—అంటే.

ఫో అంటే ఆ పెద్ద రావిచెట్టు ఉన్నది అదా—

వి అది కాదయ్యా అది సంగంవారి వీధి ఎక్కడో దర్జీదగ్గర ఉన్నదాన్ని తీసుకువచ్చి యిక్కడ యిరికిస్తావేమిటి?

ఫోర్మను సంగం వారి వీధిలోనూ రావిచెట్టు లేదనుకున్నారా?

వి ఉంది లేనన్నది పెద్ద రావిచెట్టు. సంగం వారి వీధిలో ఉన్నది దీనికంటె చిన్నది.

అయ్య యింతకీ సంగంవారి వీధి ఎక్కడుంది మీకు తెలుసా?

అయ్యవారమ్మ సంగంవారి వీధే తెలియదట. నే బళ్లో చదువుకునే రోజుల్లో మా అమ్మ నిత్యమూ ఈ వీధిలో కమ్మవారింటికి ఏదో పనిమీద వస్తూండేది

అ, అచ్చు ఆఫీసు వుండే దాని ప్రక్క వీధే 'ఇంతకీ' ఫొర్లట్టర్మ ఫోర్మను కళ్లు చిట్లించుకొంటూ గొంతుక సవరించుకొంటూ 'సంగంవారి వీధనే అక్షరంకర్ల వీధి అంటారు అసలు కోగంగిపేటలోంచి వచ్చేవీధి సంగంవారి వీధిలో కలుస్తుంది'

అయ్య అన్నే ఎక్కడ కోగంగిపేట ఎక్కడ సంగంవారి వీధి? సంగంవారి వీధి మన పాత సినిమా ఉంది దాని వెనకాల వీధి దాని ఉత్తరం వైపుని దర్జీకూడా ఉంది అంతేకాని ఈ ఫోర్మను గారికి అసలు—

ఫోర్మను అందుకుని—నాకు తెలుసండీ అబ్బ సంగంవారి వీధి ఎక్కడుందో నాకు తెలిసినట్లు మరెవ్వరికీ తెలియదు

ఇ వి అన్నే బ్రాహ్మణపేటకు నిమూలగా రైలు గేటుకు యివతల ఉందండీ ఏమిటో నాకు తెలియనట్లు మీరు వాదిస్తారు

అయ్యవారమ్మ (చేతులు కడుక్కుంటూ) అబ్బ ఏమిటే గొడవ ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు

ఇంతలో వెంగళ్రావు లోపల నుంచి వచ్చి — సంగంవారి వీధిని గురించేనా మీరు అనుకొనేది నా చిన్నతనంలో మా ముసలమ్మవాళ్ళు ఆవీధిలోనే కాపరం ఉండేవాళ్లట. మా తండ్రికి ఋణం ఉండడంచేత ఆ యిల్లూ వాకిలీ వాళ్ల పరమైపోయింది లేకపోతే నాకే అద్దె కొంపే ముప్పు అది అచ్చాఫీసుకు తూర్పువైపున ఉంది'

అగ్రహారంలోని ముసలాయన ఎప్పుడు వచ్చాడో వచ్చి, తాను మామూలుగా కూర్చునే చోటునుంచి ఈ సంభాషణ వింటున్నాడు అయినా సంగంవారివీధి ఎక్కడుంటే తనకేం గావాలి, ముందు తన పొట్ట నిండాలి గాని — యీ విధంగా సంగంవారివీధి ఉత్తరంవైపున ఉందని ఒకరూ, దర్జీకి దక్షిణభాగంలో ఉందని మరొకరూ, అచ్చు ఆఫీసు వెనకాల ఉందని వేరొకరూ యిలాగా వాండ్లు అనేక విధాలుగా తర్కించుకొంటూ ఇంకా నిర్ధారణకు వచ్చేలోపున సుబ్బన్నా మరో యిద్దరు వ్యక్తులు లోపలికి వచ్చి వీరందరికి కుడివైపున కూర్చొని యిన్ని వేడివకోడీలు ఆర్డరిచ్చారు.

ఇన్నాళ్ళకన్నా ఏమిటంటు సుబ్బన్నను చూచి 'యిదుగో పాతకాపు సుబ్బన్న వచ్చాడు యింతకీ

సులు అన్నీ ధ్వంసమైపోయాయట వాకబు చేయగా తెలిసిందేమిటంటే అది ఫోర్మను స్వంత అన్నగారి కొట్టు అనీ, ఫోర్మనుపై కోపంచేత సుబ్బన్న ఆ రాత్రే అందినమటుక్కి డబ్బు తీసుకొని ఆ కొట్టుకు నిప్పంటించి తగలబెట్టాడని చెబుతారు

## 2

దొమ్మీ కేసు కోర్టుకు ఎక్కి మేజస్ట్రీటు సదాశివరావుగారి ఎదుట విచారణకు వచ్చింది దొమ్మీ కేసును గురించీ, అందుకు సంబంధించిన వ్యక్తుల వాఙ్మూలాలను గురించి యితర పరిశీలనలను గురించి కొంతసేపు చర్చ జరిగింది పిమ్మట దొమ్మీ జరిగిన రోజున కాఫీహోటలులో మొట్టమొదట ఈ దొమ్మీ ఏ విధంగా ఆరంభించినదీ దాని విచారణ జరుగుతోంది

లా చదివిన ధర్మారావు అదివరకే కోర్టులో మంచి పేరు సంపాదించుకున్నాడు క్రాస్ ఎగ్జామిన్ చేయడంలో అతడి కతడే సాటి అతని విచారణలో చాలా కేసులు చిక్కువిడి తీర్పుకు వచ్చాయి

ధర్మా సంఘటన జరిగిన సాయంత్రం నీవు అయ్యవారూ, ఆ ఫ్యాక్టరీ ఫోర్మనూ హోటలు యజమాని చంద్రగలావు—ఇంకా ఎవరో ముసలాయన టిఫిన్ పుచ్చుకుంటూ అక్కడ వున్నారట నిజమేనా?

అయ్యవారమ్మ నిజమేనండి

ధర్మా మీరు ఆ రోజున దేనినిగురించి మాట్లాడుకుంటున్నారో మేజస్ట్రీటుగారితో చెప్తారా?

అయ్య రోగాలనుగురించి మాట్లాడుకుంటున్నామండి

ధర్మా సంభాషణలో ఎవరికైనా భేదాభిప్రాయాలు వచ్చాయా?

అ అమ్మ సంగంవారివీధి ఎక్కడవున్నదీ అనే విషయాన్ని గురించి మేము తర్కించుకోవటంలో

మేజ సదాశివరావుగారు తల పుటుక్కించి, కళ్ళజోడు బల్లమీదనుంచి తీసి అద్దాలు తుడిచి గొంతు సవరించి,

'దేనిని గురించీ' అన్నారు న్యాయమూర్తి

సాక్షి అది సంగంవారి వీధి ఎక్కడ వున్నదనే విషయాన్ని గురించి తర్కించుకుంటున్నారు

మేజ సంగంవారి వీధా?

'చిత్తం సార్'

'అయితే ఏదీ ఆ సన్నటిసందు ఉన్నదే—అదేనా—ఆ సినిమా థియేటరు ప్రక్కగుండా వచ్చే సందేనా?

ధర్మారావుకు ఒక విధమైన నవ్వు వచ్చింది మేజస్ట్రీటుగారు చెప్పిన అంశం కొద్దిగా సత్యదూరంగా వున్నది

ధ 'చిత్తం తమరు సూచించిన వీధిని గురించే సాక్షి చెబుతున్నది తమరు అనుమతిస్తే ఆ వీధి పరిసరాలను గురించి తెలుపడానికి అవకాశం ఇస్తారని మనవి

మే 'ఏమిటా పరిసరాలు' అన్నారు మేజస్ట్రీటు

గ 'చిత్తం మీరు చెప్పేదానికంటె ఆ వీధి మరో ఫర్లాంగు ఎగువన వున్నది రైల్వేగేటుకు దగ్గరగా ఉంది ఇంత బాగా జ్ఞాపకం ఉండడానికి కారణం నా చిన్నప్పుడు మా బాబయ్యగారు తరుచు రైల్వేగేటువద్దకు నన్ను తీసుకు వస్తూండేవారు

మేజస్ట్రీటుగారు ధర్మారావు మాటలను ఖండిస్తూ,

నేను నీ యీడులో ప్రతిరోజూ ఆ వీధిలో చదువుతూండేవాణ్ణి నే చెప్పిన విషయాన్ని ఖండించడం నీకు అనవసరమనుకుంటాను' అన్నారు కొంచెం కఠినంగా

లాయరు తల వంచుకొని నమ్రత చూపాడు

న్యాయాధికారితో తగవులాట పెట్టుకోవడం ఎందుకు అయినా అప్రస్తుతమైనట్టి విషయంమీద ఎందుకు విపరీతమైన తర్కం

ఇంతలో కోర్టులో మరో ముసలి లాయరుగారొకాయన లేచి

'మీ అనుమతితో రెండు మాటలు సార్, నేను కూడా చాలాభాగం ఆ వీధిలోనే పోతూండేవాణ్ణి— ఈ వీధిని గురించి నేను చాలా పరిశోధనచేయగా— నాకు తేలిందేమంటే ఈ సంగంవారి వీధి అచ్చు ఆఫీసుకు కుడివైపున ప్రారంభమై సినిమా బజారుకట్టు చివర అంతమౌతుంది.

'అట్టే సరికాదు' అన్నాడు ధర్మారావు

మేజస్ట్రేటు సదాశివరావుగారు అసలు ఈ విషయానికి కేసుకు ప్రస్తుతం ఏమీ సంబంధం లేదనీ, దాన్ని గురించి యింక తర్కించ నవసరం లేదనీ అన్నారు ఈ దొమ్మీకేసు విచారణ ఫలితం ఏమైం దనే విషయం మనకు అప్రస్తుతం పోర్కనూ, ఇన్నా రెన్నువిజంటూ, అయ్యవారూ, అయ్యవారమ్మ తమ తమ గాయాలు చూపడంవల్ల సుబ్బన్న మీద కఠిన చర్య తీసుకొని తీరాలని పట్టుపట్టనూ లేదు అయినా సుబ్బన్న విషయం వారి కెందుకు

దుష్టులను పట్టి పట్టుకుని దండించడం పోలీసు వారి విధి కేసు విచారించి న్యాయాన్యాయాలు తేల్చడం కోర్టువారి విధి ఈ లావాదేవీలలో తమ కెందుకు అని యథారీతిగా వారు ఊరుక్కు తగ్గుకు న్నారు.

మేజస్ట్రేటుగారి బావమరిది చంద్రశేఖరంగారు ఆ క్రితంరోజే పెళ్లివ్యవహారాలు మాట్లాడేందుకు చెల్లెలుగారింటికి వచ్చాడు చంద్రశేఖరం కొడుకు రామచంద్రమూర్తి ఈ మధ్యనే బి ఏ ప్యాస్ అయాడు ఇతను చూడడానికైతే బాగానే వుంటాడు కాని మనిషి కొంచెం నలుపు పొడుగ్గా, నవనవలాడే వయస్సులో ఉన్నాడు చంద్రశేఖరం తన కొడుక్కి చెల్లెలు కూతురు శారదను వివాహం చేయాలని కుతూహలపడుతున్నాడు

కాని, అసలు ఈ పెండ్లివిషయం ఇదివరకు ఒకటి రెండుసార్లు మేజస్ట్రేటుగారి ప్రత్యక్షంలో నయితే నేమి, పరోక్షంలోనయితే నేమి వలిగిన విషయమే కాని చంద్రశేఖరానికి గ్రామంలో పని తొందరవల్ల ఈవిషయం ఆలోచించేందుకు రవ్వంత కూడా వ్యవధి లేకపోయింది పైగా ఇప్పుడు తన కొడుకు చదువు కూడా పూర్తిఅయింది గనుక, పెళ్లి గూడా అయితే ఆ బరువు తీరిపోతుందని—వివాహం స్థిరపర్చుకుని—తాంబూలాలు పుచ్చుకుని తరువాత జరుగవలసిన తతంగంకోసం ప్రయత్నం చేసుకోవాలని కుతూహల పడుతున్నాడు

ఇంతకీ రామచంద్రమూర్తి పనికి కొంచెం నలుపైనా తీసిపారేసే అంత కులువుకాదు చిన్నప్పటినుంచీ గొప్పవాళ్ల రచనలన్నా వారి ఉపన్యాసాలన్నా, వారి గ్రంథాలన్నా అతగాడికి ఆసక్తి మెండు విశ్వవిద్యాలయంలో పట్టం పుచ్చుకున్న తరువాత ఇటీవల నవ్యసాహిత్యకారుల రచనలను చదివి బాగా అవగాహన చేసుకున్నాడేమో ఇక తానుకూడా ఒక రచయితఅయి ఒకకవియై, ఒక పత్రికాధిపతియై దేశసేవచేయాలని గాలిలో మేడలు కట్టుకుంటున్నాడు

ఆ పిల్లమీద తన మనసు కూడా పోయిందేమో ఆమెనే పెండ్లి చేసుకోవాలని అతగాడికి మనసులో నాటుకుపోయింది తనకు కాదని మ రెవరకు కట్ట పెడుతారు ఆ పిల్లని ?

సుమారు 8 ఘం కావచ్చింది సాధారణంగా కొంచెం ఇంచుమించు ఈ సమయానికే భోజనాలు అయే అలవాటు పెళ్లిలో ఇచ్చిపుచ్చుకోవలసిన లాంఛనాల విషయంలో బావమరదులకు తెగక ఆ రోజు భోజనాలు కూడా ఆలస్యమయినాయి పెళ్లి సంగతే వరండాలో కూర్చుని మాట్లాడుకుంటు న్నారు

మే భార్య భోజనాలకు వేళయింది లేవండి యిహ తరువాత కూర్చుందాం

చంద్రశేఖరం బావగారూ—మీరు ఊఁ అనడమే తరువాయి ముందు తాంబూలాలు పుచ్చుకుంటే, మిగతా పనంతా మేము చూచుకుంటాం

మే భా లేవండీ చేసినవన్నీ చప్పగా చల్లారిపోతాయి భోజనాలయిన తరువాత

చంద్ర ఇదుగో లేస్తాం బావగారు లేస్తే నేనూ లేస్తాను

మేజ ఇందులో నాదేముందోయ్ అంతా మీ చెల్లెల్ను అడుగు ఆమె యిష్టానుసారమే కాని, నా ప్రమేయం ఏమీ లేదు

చంద్ర అదేమ్మాట నా ప్రమేయం లేదంటా రేమిటి ? యిది మరీ బాగుంది! మీ రనేది మీరు పెద్దలు 'ఆ మాట' మీరు లాంఛనప్రాయంగానైనా అనకపోతే ఎట్లా ?

మేజ అనడాని కేముంది ఇంతకీ మా శారద ఏమంటుంది ఏమి మాట్లాడదేమి ? ఆ పుస్తకాలు అక్కడ పారేద్దూ బాబు కాస్సేపు మీ బావను

కార అబ్బ పోదురూ ఒకటే గొడవ చదువుకోనివ్వరుగదా యీ కథ చాలా ఇంట రెస్టింగ్‌గా ఉంటే సమయంలో

మే భా. అమ్మాయీ, ఏమిటా విస్సాటం మీ నాన్నగారు ఏదో అంటుంటే బదులు చెప్పక ?

కార నన్నడగ నక్కర్లేదు అంటూ అక్కడ నుంచి లేచిపోతుంది

మే భా ఏమీ పలకదు ఉలకదు ఉద్దేశ మేమిటో చెప్పకూడదూ ?

మేజ నా వుద్దేశాని కేముందే ? మీ అమ్మాయి నడుగు అమ్మాయి నడగక నన్నడుగుతా వేమిటి ?

మే భా అమ్మాయినీ అడిగారు, అబ్బాయినీ అడిగారు యిహ మీకే తరవాయి

మేజ ఏమో వచ్చేఏడు చేయాలని వున్నది పెళ్లంటే మాటలేవిటి ? ఈ రోజుల్లో అబ్బో అబ్బో బోలెడుఖర్చులు కాస్తా కూస్తా నేమిటి ?

మే భా యింకా ఖర్చులేమిటండీ ? ఖర్చు లంటారు ఉభయఖర్చులు మీ భావగారే పెట్టుకుం టారట అమ్మాయికి 10 కాసుల బంగారం గొలు సులు, వజ్రాల కంఠమాల, లేడీస్ రిస్ట్‌వాచ్, పట్టు చీరలు, వెండికంచం, మరచెంబు—యిహ కావలసిం దేముంది గనక తాంబూలాలు పుచ్చుకుంటే సరి

మేజ ఈమధ్యనే—మొన్న మన లాయరు ధర్మారావు పెళ్లివిషయంలో అతని బావమరది కన పడి యీ ప్రస్తావనే తెచ్చాడు

బావ అంటే మీ కోర్టులో ప్రాక్టీసు

మేజ అవును అయనే

బావ చూడండి ఆపెద్ద రావిచెట్టు వుంది— ఆ దూపాటివారి వీధిలో వున్న ఆయనేనా ?

మే భా భోజనాలకు లేవకూడదుటండీ యిహ ఆలస్యం అవుతోంది

మేజ అబ్బే అది దూపాటివారి వీధి కాదు ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువచ్చి దూపాటి వారి వీధి అంటావేమిటోయ్ బలేవాడివ్

బావ కాదండీ, దూపాటివారి వీధిలో రావి చెట్టు లేదంటారేమిటి ? ఆ వీధి మొదట్లోనే ఉండి తీరాలి.

మేజ ఉండొచ్చు దూపాటివారి వీధిలో ఉన్నది పెద్దది సంగంవారి వీధిలో ఉన్నది చిన్న చెట్టు ఇంతకీ నే చెప్పిన వీధి సంగంవారి వీధి

బావ ఏమో మరి ఇంతకీ సంగంవారి వీధి ఎక్కడుందంటారు ?

మే ఇప్పుడు పాతసినిమా థియేటర్ వున్నదే దాని ప్రక్కగుండా వెళ్లే సందు రైల్వేగేటుకు దగ్గ రగా ఉన్నది

బావ : అదికాదండీ మాకాయా, అచ్చాఫీసు వుంది—దాని ప్రక్క వీధే సంగంవారి వీధి ఈ మాత్రం నాకు తెలియదూ ?

మే భా రామాయణంలో పిడకల వేట. సంగం వారి వీధి ఎక్కడుంటే ఏం ? మంగలివారి వీధి ఎక్కడుంటే ఏం ?

మేజ ఆఁ నేను పాతసినిమాథియేటరు ప్రక్కనుండా వెళ్లే సందే సంగంవారి వీధి అంటున్నా మీ అన్నగారు అది కాదంటున్నారు

మే భా మా అన్నయ్య చెప్పిందే రైటు అచ్చాఫీసు ప్రక్కవీధే అని మా ముత్తవతల్లి చెపు తుంటే విన్నాను

మేజ అవిషయం తెలుసు అయినా తెలిసీ తెలియని వాదన లెందుకు నీకు ?

మే భా బాగుందండి మీ రవేది ఇక మీ పొక్కరికే గాబోలు ఊరుసంగతి తెలిసినది

మేజ నా చిన్నతనమంతా, చదువుసైతం యీ వూళ్లో పూర్తిఅయింది ఏమిటో నాకు తెలియ నట్లు, మీకు మహా తెలిసినట్లు మాట్లాడతా రేమిటి ?

మే భా ఆయన మాటలకేంగాని—

మేజ నీవు మహా చెప్పొచ్చావులెద్దూ లోప లికి పో అయినా ఊళ్ళోకి వెలకోసారి, ఏడాది కోసారి వస్తూ—వూరు సంగతి ఏం తెలుసు మీకు. ఎక్కడో సంగంవారి వీధిని తీసుకువెళ్ళి దూపాటి వారి వీధి అంటే ఎవరైనా నమ్మాలా అక్కర్లేదా ?

బావ మా తండ్రిగారి హయాంలో ఏదో ప్రస్త కాలం అచ్చువేసే సందర్భంలో అచ్చాఫీసుకు పంపే వారు. అచ్చుఆఫీసుకు ప్రక్కనుంచే సంగంవారి వీధి తెలుస్తుంటేది. నాకు బాగా గుర్తు లేదంటారేమి టండీ.

శారద: ఏమిటండీ—యీ గొడవ నన్ను పుస్తకం పూర్తిచెయ్యనియ్యరా ఏమిటి?

మేజ: అమ్మాయ్—నీవు చెప్పు సంఘంవారి వీధి ఎక్కడుందో?

శారద: ఓస్ దీన్ని గురించా సంఘంవారి వీధి పాతసినీమా థియేటరు ఉందే దాని ప్రక్కగుండా వెళ్ళే సందే సంఘంవారి వీధి

మేజ: బాగా కరెక్టుగా చెప్పావ్ అది కాదంటాడు మీ మావయ్య

శారద: ఆ వూళ్లో ధాన్య మేమిటో, పంట ఏమిటో అంతేకాని, మావయ్యకు ఏమీ తెలియదండీ నాన్నా మా కాన్వెంటు స్కూలుకు వెళుతుంటే ప్రతి రోజూ మా బండి ఆ వీధి ప్రక్కనుంచే వెళుతుంది సుబ్బన్నగారి అమ్మాయి ఆ వీధిలోనుంచే వస్తుంటేది

మే. భా: నీకు మహా తెలుసు పసిపిల్లవు నీ వూరుకుందూ

శారద: బాగుందే అమ్మా ఏం నాకు మాత్రం తెలియదూ

మేజ: దాన్ని వూరుకోమంటూ వేమిటే ఏం దానికిమాత్రం తెలియదా?

బావ: బావగారూ, మీరు బాగా ఆలోచించండి సంఘంవారి వీధినే అసలు అష్టవంకర్ల వీధి అంటారు. కోణంగి పేటలోంచి అచ్చుతాఫీసువద్ద కలిసే వీధే సంఘంవారి వీధి

మేజ: ఆలోచించే దేమిటండీ ఆలోచనా పాలోచనాను మీరన్నది తప్పండీ సినీమా థియేటరు ప్రక్కగుండా వెళ్ళే సందే సంఘంవారి వీధి ఇంత విపదీవి చెప్పినా మీరు కాదంటే ఏమి చేయాలి

బావ: యిక మీతోటి వాదించి ఏం ప్రయోజనం

మేజ: అయితే నే చెప్పింది కాదంటారా?

బావ: నే చెప్పింది మాత్రం తప్ప కెక్కడుంది.

మే. భా: మన కెందుకు వచ్చిన గొడవ ఇది. సంఘంవారి వీధి ఎక్కడుంటే ఎవరి క్కావాలి ముందు అమ్మాయి పెళ్లిసంగతి ఆలోచించండి

మే. అయితే నీతాని కేమిటి?

మే. భా: తాంబూలాలు పుచ్చుకోమని

మేజ: పుచ్చుకోవచ్చులే యిప్పుడు వచ్చిన తొందర ఏమీ లేదు

మే. భా: మీ యిష్టం బాగా ప్రాణం విసిగిపోతూంది మీతోటి ఇప్పుడు గాకపోతే మరి కెప్పుడో అయినా అమ్మాయిని యివ్వకపోతే నాడికి పెళ్లి జరగదా వాడు దీన్ని పెళ్లి చేసుకోకపోతే వీడికి పెళ్ళవదా?

బావ: అమ్మాయి నీ వూరుకో అయితే బావగారు తాంబూలాలు పుచ్చుకోవడం దాకా వచ్చి మళ్లీ ఇట్లా మాట్లాడుతున్నారే

మేజ: దాని పెళ్లి కిప్పుడేం తొందర లేదండీ తరువాత మాదుకోవచ్చు

మే. భా: పెళ్ళి లేదు—ఏమీ లేదు కూర్చో పెట్టండి యింకా ఎన్ని రోజులు పెళ్ళి చేయకుండా కూర్చోబెట్టా లనుకున్నారో

బావ: నే వస్తానే అమ్మాయి ఇప్పుడు బండి వుంది రాత్రి రైలుకి పోతున్నా

మే. భా: అన్నయ్య భోజనంఅయినా కాలేదు భోంచేసి వెళ్లు నా మాట విను

చంద్ర: భోజనానికేం లేవే భోంచేస్తే రైలు దాటిపోతుంది నే వెళ్లొస్తా అంటూ వచ్చినదారినే వెళ్ళిపోయాడు చంద్రశేఖరం

## 4

మరికొన్ని రోజులకు తరువాత మేజస్ట్రేటుగారింటికి వచ్చే సూరిశాస్త్రిగారు ఆ రోజు మధ్యాహ్నం ఏదో పనుండి వచ్చారు. వరండాలో కూర్చొని తాంబూలం వేసుకోసాగారు పోకలు నములుతూ శాస్త్రిలవారు

'నా మనస్సుకు ఈ విషయం పట్టినట్టు మరేదీ పట్టలేదు నాకు అర్థమయినట్లు మరెవరికీగూడా అర్థమవనే అయివుండదు' ధర్మారావును ఉద్దేశిస్తూ గాలోలు—'అయినా ఆ వృత్తిలో సతతమూ తిరిగే వాళ్ళకూ, ఆ ధారాశుద్ధి, ఆ వాక్శుద్ధి వుండదూమరి చెడ్డఅలవాటు ఏమంటే కావలసిన సాక్ష్యమూ, పరిశోధనా రుజావూ లేకుండా వితండవాదం చేసినందువల్ల ప్రయోజనం ఏముంటుంది దీనవది దీన్ని గురించి వనక కొన్ని ప్రాణాలు పోయాయి'

శాస్త్రులవారు మరో రెండు తమలపాకులు తీసుకుని నములుతూ—

'యింతకీ సంగంవారి వీధినిగురించి జ్ఞాపకం ఉన్నదా ?'

మేజ లేకేం

మరి అదెక్కడ వుందంటారు ?

మేజస్ట్రీటుగారు పెన్సిలు తీసుకుని పేకలు అట్టమీద వివరంగా గీచి చూపుతూ, 'అక్కడనుంచి మొదలు ఇంకెవరకూ ఉన్నదే సంగంవారి వీధి '

శాస్త్రులవారు బాగా పరీక్షించి తదేక దీక్షతో ఆ మ్యాపును చూచి గొంతు సవరించుకుని,

'మీరు శ్రమపడి మ్యాపు గీయడమైతే గీశారుగాని—అసలు ఈ వీధి ఎక్కడుందన్న విషయంలో మీ అభిప్రాయం కూడా తప్పే—ఆ రోజు లాయరు గరార్త్రరావు చెప్పింది తూచాగా సరిపోయింది' అన్నారు కొద్దిగా నవ్వుతూ

'ఓహో అల్లాగా'—అంటూ అంతవరకూ ఖులాసాగా సంతోషంతో కబుర్లుచెప్పిన మెజస్ట్రీటు సదాశివరావుగారు ఖేదరించుకుంటూ ధ్రుముని కుర్చీలోంచి గభాలున అక్కడనుంచి లేచ్చకొక్క పోయారు

'ఇదేమిరా బాబు – ఎన్నడూ లేనిది నేను ఈయనకు కోపం తెప్పించామే' అనుకుంటూ మెల్లిగా ఇంటికి బారాడు శాస్త్రులవారు

కోపం శాంతించిం తరువాత మేజస్ట్రీటుగారు వాకబుచేయగా తేలినవిషయ మేమంటే ఈ సంగం వారి వీధిలో సంగం బాపన్న అనే అతను ఉండే వాడనీ, పిమ్మట అతను చనిపోగా అతని కొడుకు సంగం చలమయ్య క్రిస్టవమతం పుచ్చుకుని తనకు అక్కడ ఉన్న స్థలం, ఆపాటికొక్కు అన్నీ పురపాలక సంఘంవారికి అమ్మేసి ఏదో వూరు లేచిపోయాడనీ, యిప్పుడు ఆ స్థలంలో పురపాలక సంఘంవారు ఎలిమెంటరీ పాఠశాలకు యి వలనే నిర్మించారనీ, కాగా యిప్పటి పురపాలకసంఘ ప్లానులో అసలు సంగంవారి వీధి లేనేలేదనీ తేలింది



# రాయలవారి ఋతువర్ణనలు



శ్రీ దివాకర్ల వేంకటావధాని

ప్రబంధములు వర్ణన ప్రధానములైన కావ్యములు. పెద్దనార్యుని నాటినుండియు ప్రబంధ కవులేదో యొక యుపకథను కల్పించుకొని తమ కావ్యములలో నష్టాదశవర్ణనములను గావించుచు వచ్చియున్నారు. ఈ పదునెనిమిది వర్ణనలయభావము ప్రబంధమున నొక లోపముగా భావింపబడుటచే కొందరు కవులు ప్రసక్తి లేకపోయినను నియమానుసరణమునకై యనావశ్యకములైన వర్ణనలు కావించుటయు గలదు. వర్ణ్యములైన యీ యష్టాదశ విషయములలో ఋతువులు కూడ చేరి యున్నవి. అందుచే ప్రబంధకవులు కథా సందర్భమునుబట్టి యేదో కొన్ని ఋతువులనైన వర్ణింపకుండెడువారు. శ్రీ కృష్ణదేవ రాయలవారు తమ యాముక్తమాల్యదలో నాలుగు ఋతువులను గూలంకషముగా సూక్ష్మాతిసూక్ష్మ వివరములతో వర్ణించియున్నారు. ఆ వర్ణనలలో నాయన యనన్యకవిసాధారణమైన ప్రతిభాచాతుర్యములను ప్రదర్శించి యుండుట యాముక్తమాల్యద పఠించిన వారెల్లరకును విదితమే. ఆ ప్రతిభాచాతుర్యముల నీ వ్యాసమున యథాశక్తిగా నిరూపింప యత్నించెదను.

గోదా శ్రీరంగేశ్వరుల ప్రణయమే యాముక్తమాల్యదయందలి ప్రధానవృత్తము. అది యందలి చివరి రెండాశ్వాసములలో చక్కగా వర్ణింపబడి యున్నది. మొదటి నాలుగాశ్వాసములలో నీ కథతో నంతగా సంబంధము లేకపోయినను వైష్ణవమతాభిమాను లగుటచే రాయలవారు విష్ణుపారమ్యమును సూచించు విష్ణుచిత్తయామునాచార్యుల వృత్తాంతములను వివరీకరించి యున్నారు. విష్ణుచిత్తుడితర మతస్థుల నోడించి పాండ్యరాజునకు వైష్ణవమతపారము నుపదేశించు సందర్భమున ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానమును, యామునాచార్యుడు శ్రీరామమిశ్రునిచే నుద్బోధితుడై కుమారునకు రాజ్య మొప్పగించు సందర్భమున దీర్ఘమైన రాజనీతి వర్ణనమును గలవు. చివరి యాశ్వాసమున మాలదాసరి వృత్తాంతముపకథగా నున్నది. ఈ యుపకథోపాఖ్యాన రాజనీతి వర్ణనలకు తోడు మన్యమున్న గ్రీష్మవర్ష శరద్వసంతముల విపులవర్ణనము లున్నవి. ఇవన్నియు గలిసి యాముక్తమాల్యద యందలి ప్రధానకథను మఱుగు పుచ్చి దాని నొక చిన్న విష్ణుపురాణముగా నొనర్చి వైచినవి. వస్త్వైక్యమునకు భంగము చేకూర్చు నప్రసక్త విషయ విస్తరణ మాముక్తమాల్యద పఠించువారి కించుక కించ కలిగించినను అందలి ప్రకృతి పరిశీలన భావ గాంభీర్యాదుల సుందరమైన యానందమును చేకూర్పక మానవు.

ఆంధ్రవాఙ్మయమున కొల్లింటికవులు తమ తమ కావ్యములలో వసంతాది ఋతువులను వర్ణించి యుండకపోలేదు. కాని యావర్ణనలెవ్వియు రాయలవారివర్ణనములంత దీర్ఘములుగా గాని కూలంకషములుగా గాని కానరావు. ఆంధ్రవాఙ్మయమున నే కాదు సంస్కృత వాఙ్మయమునగూడ ఋతువర్ణనైకవస్తుకములగు ఋతుసంహారాదుల నెక్కుడ నితరకావ్యములలో నింత దీర్ఘమునుసమైన ఋతువర్ణనము కానబడదు. ఇటీవల గవిసమ్రాడ్బిరుదాంచితులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు తెలుగు ఋతువులను పేర నొక ఋతువర్ణనప్రధానమైన కావ్యమును ప్రకటించియుండిరి. అందలి వర్ణనములు పైతము భావగంభీరములై కవిగారి ప్రకృతి పరిశీలన నైశిత్యమును నేక విధముల వెల్లడించుచున్నవి. చిన్నదయ్యు మనోహరమైన యీ కావ్యమునే యేకవిధముగా రాయలవారి ఋతువర్ణనలకు సాటిగా పోటిగా చేర్కొనవచ్చును. మిగిలినవానిలో ఋతువుల వర్ణనములున్నను ఇన్ని ఋతువుల వర్ణనము లేదు, ఉన్న ఋతువుల వర్ణనమైనను ఇంత సమగ్రమైనది కాదు.

స్థూలముగా బరిశీలించినచో నాముక్తమాల్యదలో ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యాన రాజనీతి వర్ణనాదులవలెనే యతిదీర్ఘములైన యీ ఋతువర్ణనములును గథాగమనము నడ్డగించి కావ్యమునందలి వస్త్వైక్యమునకు భంగము కలిగించియుండుట యథా

ర్థమే యనిపించును కాని సూక్ష్మముగా జూచి నప్పుడు వానికి గథాంశములతో గవి కల్పించిన సంబంధము స్పష్టము కాకపోదు ద్వితీయాశ్వాసము నందలి కథకు వేశ్యాగృహమున కరుగుపాండ్యరాజు పరదేశివిప్రుడు పఠించిన సుభాషితశ్లోకము నాలించి, హఠాత్తుగా విరక్తుడై సౌధమునకు మరలివచ్చి మోక్షప్రదుడైన దేవు డెవ్వడో నిర్ణయింపుడని పండితుల గోరిన ఘట్టము కేంద్రభూతమైనది సుభాషితము చదివిన విప్రుడెప్పటి కప్పుడు వచ్చుటకు "దన్ని కట వృషగిరి హరికి విభవము విప్పగా" జరుగు తెప్పతిరునాళ్లజూచు కోరికయే కారణము అళఘురియందుండు సుందరబాహుస్వామికి దెప్పతిరునాళ్లు వేసవిలో జరుగును ఆ యుత్సవముల గన్నులార భక్తితన్మయుడై చూచి పోవుచు బరదేశి బ్రాహ్మణుడు మధురానగర దిదృక్షు ప్రవేశప నచ్చుటి కరిగి, రాజపురోహితునింట గ్రీష్మకాలోచితమైన మృష్టభోజనము కావించి, తోడి విప్రులతో మార్గవేదికపై బరుండి యుబుసుపోకకై వారిలో నొక్క డార్యలును వేరొక్కడు గీతలను బఠింప దాను సుభాషితము జదివెను అతడు మార్గవేదిపై బరుండుటకు హేతువు "పెను వేసవి" అతడు వచ్చుటకు హేతు వా వేసవిలో వృషగిరి హరికి జరుగు తెప్పతిరునాళ్లు వేసవిలో దప్ప మరెక్కడ యుత్సవము జరుగను జరుగదు, పరదేశి బ్రాహ్మణు డిప్పటికి రాను రాడు వచ్చినను మార్గవేదిపై బరుండడు మార్గవేదిపైగాక యే గృహాంతర్భాగమునన్నో శయనించి యాతడు సుభాషితముల జదివినను వీథిలో బోవువారి కవి వినబడవు పాండ్యుడా సుభాషితమును వినకుండినచో గథాసంవిధాన మీ తీరున సాగియేయుండదు ఇన్నిటికిని హేతువగుట చేతనే రాయ లిచ్చట నా వేసవిని వర్ణింపబూనినాడు

చతుర్థాశ్వాసమున వర్షశరదృతువులు వర్ణింపబడినవి ఈ వర్ణనలు యామునాచార్యుడు తనతో వాదము చేయవచ్చినవారి నెల్లర నోడించి విష్ణుదేవుడే పరతత్త్వమనియు విశిష్టాద్వైతమే మతమనియు బ్రతిష్ఠించిన పిమ్మట జేయబడినవి పాండ్యరాజు యామునాచార్యుని మాహాత్మ్యమునకు సంతోషించి, సాష్టాంగ మెరగి, యాతనికి దన కడగొట్టు చెలియలి నిచ్చి పెండ్లిచేసి, "యరణంబుగ నమ్మహాత్మునకు ధారాపూర్వకముగా నర్ధరాజ్య మిచ్చి" యువరాజుగా నొనరించెను పిమ్మట వాతని కధర్వశిరస్సభృగ్హస్త మగుటయు నందు దివ్యాస్త్రమంత్రంబు లుండుటయు నెఱింగి దుస్సాధంబగు విరోధియానంబు సాధింపుమని దండయాత్రకు బంప యామునాచార్యు డందుకు సన్నద్ధు డగుచుండెను అప్పటికి సరిగా గ్రీష్మము ముగిసి వర్షాగమ మారంభము కానుండెను పురోహిత ప్రధానమంత్రి వర్గంబు యామునాచార్యు దిగ్విజయ యాత్రా సన్నాహ మెఱింగి "సన్నిహితంబులగు నివ్వార్షిక దినంబులు గడపి శరత్సమయంబున విద్విషత్సంహారంబునకు విజయము సేయు"మని బోధించిరి యువరాజు వారి మాటలు పాటించి, యుక్తముగు రాజున కెఱింగించి తత్సమ్మతి నప్పటికి నిలిచెను

ఋతువు లాటింటిలో శరదృతువు వీరరస ప్రధానమగు దిగ్విజయయాత్ర కనువైనట్టిది సాధారణముగా బూర్వపురాజులు దండయాత్ర వెడలుట యా ఋతువునందే ఈ యాచారమును బురస్కరించుకొనియే సంస్కృతాంధ్రకవులు పలువురు దిగ్విజయయాత్రలను వర్ణించుటకుముందు శరత్తును వర్ణించి యుండిరి కాళిదాసు రఘువంశమున రఘుమహారాజు దిగ్విజయ యాత్రకుముందు శరదృతువును వర్ణించి యుండుట యెల్ల రెఱింగినట్టిదే సంస్కృత నాటకముల ప్రస్తావనలలో వీరరసము ప్రధానరసమైనప్పుడు శరదృతువు వర్ణింపబడవలెనని లాక్షణికులు నియమము కావించుట యారసమునకును ఋతువునకును గల యానుకూల్యసామ్యములను బురస్కరించుకొనియే యై యుండును ఈ సంప్రదాయము ననుసరించియే రాయ లిచ్చట యామునాచార్యుని దిగ్విజయమునకు నాందిగా శరదృతువును వర్ణింప దలచినాడు

ఈ శరదృతువర్ణనమునకుముందు మిక్కిలి దీర్ఘమైన వర్షర్తు వర్ణనము కలదు దీని కిచ్చట నంతగా బ్రసక్తి లేదు కాని పాండ్యరాజు తన చెల్లెలిని యామునాచార్యున కొసంగి, యాతని యువరాజుగా నొనరించి, దిగ్విజయయాత్రకు బ్రోత్సహించినది గ్రీష్మర్త్వంతమునందు వార్షికదినంబు లప్పటి కతి సన్నిహితములై యుండెను. వర్షర్తువు గడచిన

నిమ్మటగాని యామునుడు చైత్రయాత్రకు బయలు దేఱరాదని వృద్ధపురోహితాదుల యభిప్రాయము ఈ వర్షకాలము రాకపోకలను సూచించు తలంపుతో రాయలు శరత్తునకు బూర్వము దానిని వర్ణించి యుం డెను అయిన శిశిర ఋతువులయందు గంటె వర్షర్తువు నం దభిమాన మెక్కువ ఆ మన యీ యభిమానము వర్షర్తు వర్ణనమునం దలైన స్పష్టముగా గోచరించును ఈ వర్షర్తువురాక నాయన యాంతకుముందే "గ్రీష్మసమయ నిరుత్సాహకేకిరమణి, నవఘనధ్వని కలరు చందమున నలరి" పాండ్యరాజా భార్గవ యాతనిలో యామునా చార్యుమదంతము నెఱింగించెనను సందర్భమున నతి రమణీయముగా సూచించియున్నాడు ఈ సూచ నయు దగువాతి సాగిన వర్ణనయు మిక్కిలి మనోహర ములుగా నున్నను ఇంత దీర్ఘముగా నా ఋతువు నిచ్చట వర్ణించుట కొంత యప్రసక్తముగా నేయున్న దని చెప్పవలయును

పంచమాశ్వాసమునందలి కథ కలంకారమైనది గోదా విరహఘట్టము ఈ విరహ మాంధ్రవాఙ్మయ మున కపూర్వమైనది హార్దమైన యనురాగము నింత తెన్నగా సూచించు విరహమును వర్ణించిన కవి యాంధ్రవాఙ్మయమున నింకొక్కడు లేడు విరహమున కుద్దీపనమైనది వసంతము అందుచేత నే రాయ లిచ్చట నీ వసంతర్తువును సమగ్రముగా వర్ణింప బూనినాడు

మొదల నాముక్తమాల్యద మదనతాప
తరణి తెమలిట్ట తేగిన దక్షిణాశ
మక్కళ్ళతోమ్మక్రదు దుదముట్ట మాఘునను చు
దొలగ నన నుత్తరాశకు దొలగ దరణి

గోదాదేవి ధనుర్మాసమున విష్ణుసేవా వ్రతమును బూని ముప్పదిదినములు ముప్పదిపాటలుగా దివ్యప్రబంధము పాడెనని ప్రతీతి దీని కనుగుణముగా రాయలు పై పద్యమున మార్గశిరము దక్షిణాశ విడి యుష్ణ దుత్తరాశకు దొలగెనని వర్ణించియున్నాడు

ఈ విధముగా నీ ఋతుచతుష్టయవర్ణనము మిక్కిలి దీర్ఘమైనను గథ కేదో విధముగా నించుక సంబంధించియే యున్నదని తెలియవచ్చుచున్న ఈ ఋతువర్ణనమునుబట్టియే కాక రాయలు కావించిన రాజనీత్యాదులవర్ణనములను బట్టి కూడ జూచినచో నాక జరితవర్ణనాభిలాషియని పొడగట్టును ఏదైన విష యములను వర్ణింపదలచినప్పుడు దానిని సర్వాంగసుంద రముగను సమగ్రముగను వర్ణించినగాని యాతనికి దృప్తికలుగదు అవలాకాలముతీరే యట్టిది కాబోలును. కార్యనిర్వహణమున గాని భోగాను భవమునగాని సమగ్రతయే యప్పటివారి లక్ష్యముగా నుండెను కార్యమును సామిసామిగా జేసి యూరకుం డుటకాని, భోగవిలాసముల నించించుక యను భవించి విరమించుటకాని వా రెఱుగని పద్ధతులు ఆ చిత్తవృత్తియే యీవర్ణనలందును గోచరించు చున్నది ఈ నాలుగువర్ణనములును సూక్ష్మతిసూక్ష్మ వివరములతో గూడి సర్వసమగ్రములుగా నున్నవి. ఈ సామగ్ర్యమే వాని కవితాకావ్యసాధారణమైన గాంభీర్యమును దచ్చిపెట్టినది

కాలమెప్పుడు నొక్కమాదిరిగా నుండదు అది ప్రతిక్షణమును బరివర్తన మొందుచుండును ఆ పరివర్తనప్రకారము దినములు గడచినప్పుడు కాక ఋతువులు మాఱినప్పుడు మిక్కిలి స్పష్టముగా గాని పించును ఒక్కొక్క ఋతువున కొక్కొక్క వాతావరణ ముండును పంచభూతాత్మకమైన ప్రకృ తిలో గలుగు మార్పె యీ వాతావరణమునందలి మార్పునకును గారణమైయుండును ఈ మార్పు మాన వులందరికిని గోచరించినను గవులదృష్టికి మఱింత స్పష్టముగా విశదముగా గోచరించును దానిని వారు నిపుణముగా బరిశీలించి యక్షరరూపమైన యాకా రముతో నచ్చుకొట్టుదురు అట్లు ఋతువులకు సంబంధించిన భిన్నభిన్న వాతావరణముల సుంద రముగా జిత్రించి వానిని బఠితలముందు సాక్షాత్క రింప జేయుటలో రాయలు కడుంగడు నేర్పరి ఆముక్తమాల్యదలో నాతడు గ్రీష్మవర్షశరద్వసంతము లకు సంబంధించిన వాతావరణ పరిస్థితులను ప్రకృతి సౌందర్యవిశేషమును జిత్రమునందట్లు మిక్కిలి స్పష్టముగా వర్ణించినాడు అతడు వర్ణించిన మరు మరీచికలు, కాల్మరిభలము రెండకు బనులగా గాలిలో నెగిరియాడు తూలికకములు, బొందుమల్లియలు, ప్రపలు, సుడిగాలులు గ్రీష్మమును మూర్తిని మన కట్టెదుట సాక్షాత్కరింపజేయుచున్నవి వర్షకాలము రాగానే యీ పరిస్థితులన్నియు మాఱిపోయినవి. అప్పు డాకసమున నెచ్చట జూచినను బంచలా

కాలవర్ణనమున మహోన్నతచాకచక్యమును ప్రకటించెను. అప్పుడు వంటయింటి నిల్లాండ్రు పసుల్లేకయును వర్ణించు నీ పద్యమాయన సూక్ష్మపరిశీలనకు పరమావధి

ఇల్లిల్లు దిరుగ నొక్కింతయు శిఖి, యుప్పె
సె నింటిలోఁ బూరియున్ నిసరక
రాజదు, రాజిన రవులుకొల్పఁ దలఁచె
కాని కల్గదు కూడు, దాన గలిగ
సేని కూరగుటముం, దైన చెవ్వొగసుభు
భుక్తి సేకూరదాభుక్తి కిడిన,
బ్రాగ్భోక్తలవి తీయ బహుఃనాన్నము దీర
వారలకొదవు బునః ప్రయత్న

మాజ్యపటముఖ్యులయ మెన్నరు ఈపద్యమును జదువునప్పుడు సామాన్యజనసహజమైన యీ క్లేశము నాయన యెప్పుడు చూచెనాయని యాశ్చర్యమును, ఆయన సూక్ష్మాతిసూక్ష్మ పరిశీలన కానందమును గలుగక మానదు.

సాధారణముగా గవులందఱును వర్ణనసందర్భములందు గవిసమయముల మాత్రిగా గొని వింత వింత భావముల వ్యక్తము చేయుచుందురు ఈ కవిసమయములు యథార్థములగునా కాదాయనునది వేఱు మాట కాని యవి సర్వకవిసంప్రయుక్తము లగుటచే మనకు వింతగా నుండకపోవుటయేకాక వర్ణ్యవిషయమును మఱింత స్పష్టము కావించును ఋతువులన్నిటికి సంబంధించిన కవిసమయము లిట్టి విన్నో కలవు రాయలం దొక్కదానిని గూడ విడువకుండ వర్ణించుటలో గృతకృతార్థుడు ఈయన వర్ణనలలో నీ సమయ పరిజ్ఞానము సర్వతోముఖముగా గోచరించును. ఒక్కొక్క సమయమును బురస్కరించుకొని యాయన యొక్కొక్క రమ్యమైన భావమును సృష్టించుచుండును గ్రీష్మమున దివసములు దీర్ఘము లగుట కవిసమయమునందే కాక శాస్త్రమునందు గూడ సిద్ధమైన విషయము అప్పుడు చెట్టిదంపు బెట్టచే హస్తము చెమర్చిల స్తకము దుఃశీలం జేయుటచే సవరింప వశముకాక మదనుడు చెఱకువిల్లుడిమి బడవైచెనట అది చెఱకుపండెడుకాలమగుట యీ భావము పుట్టుటకు హేతువయ్యెను చాతకములు మాగి యొక చినుకైన నుర్వికి దిగ్గనీకుండుట, ఘనుడు సకలజుడు నిద్రయుమ్మ కేశవుని నిద్రవుచ్చుట వాంఛ లాఱును విని యలకై దివి సెలబల చుట వర్షకాలమునకు సంబంధించిన సమయములు. తనయులు చొచ్చిన యింట్లనే యుండి కాన్పునకు బుట్టినిర్పరుట రాయలవారికే కాక యిప్పటికిని మాఱని సంప్రదాయము దీనిని బురస్కరించుకొని యాతడు వనధిగమన ఘుచే సగర్భములైన యర్కకిరణములు ప్రసూతికై మరల నాతని ధామము చేరెనని చక్కగా వర్ణించెను "ద్విజతి నారణ్యక ధ్వని వినగ జేసి గర్భము సుఖమ్యుతము చేయ గమంగుటయు నిట్టి సంప్రదాయమే వర్షకాలమున బ్రొయ్యి రాజమిచే బోనము ప్రజకు జక్కలబోనమగుట యెవ్వ రెఱుంగని విషయము ? ఈ సమయ సంప్రదాయముల నెఱుంగుట యొకటి, వాని నూతగా జేసికొని దివ్యములైన భావముల సృజించుట వేఱొకటి రాయ లిట్టివానిని ప్రత్యేకాభిమానముతో వర్ణించువా యనిపించును శరదృతువు రాగనే రాజమరాళములు క్రౌంచగిరి రంధ్రముద్వారా దశార్ణదేశములకు దిరిగివచ్చును ప్రజలు శరద్వ్యాజపేయము లొనరింప గడగుదురు విష్ణువు నిద్రనుండి మేల్కాంచును కలశీసూను డుదయించి కలుషితాంభస్సులకు ప్రసన్నత చేకూర్చును ఈ సమయములు గంభీరములైన భావములకు బ్రభవములై రాయలవర్ణనములకు మహత్తరమైన యౌదార్యము చేకూర్చును సంతతికి దంతములు చూపట్టగనే వనితలు పురుషసాంగత్యము నభిలషింతురను సంప్రదాయమును వనలక్ష్మి మాధవులయం దారోపించి రాయలు మనోహరమైన భావమును బలికిచ్చెను ఇంక వసంతకాలము రాగానే లతావృక్షాదుల బుష్పింపజేయుటకై యవలంబింపబడు దోహదములలో నాయన వర్ణింపనిది లేదు వసంతవర్ణనలో నించుక తక్కువగా సగమీ దోహదముల కోలాహలమే ఆయన దోహదపరిజ్ఞానము మూలంకషమైనది ఈ దోహదముల యాథార్థ్యము పరిశీలించుటకు బరిశోధనలు చేయించినచో ప్రభుత్వమువారిప్పుడు తలపెట్టిన వనమహోత్సవమున కెంతో వన్నె చేకూరును.

కాలము మార్పునకు గ్రహచలనము హేతువు ఏకాలమున నే గ్రహము లెచ్చటెచ్చట నుండునో జ్యోతిశ్శాస్త్రము వివరించును ఈ శాస్త్రమున జాతకభాగము మాట యెట్లున్నను సిద్ధాంతభాగము మాత్రము సిద్ధాంతమైనట్టిదే. రాయలవారి జ్యోతి

గాడ్పుల వాకలిపొర్వ్యక్షాముడు గ్రీష్మమున నెనయు మీద బిండివోయగా జాట్టుజొగసిన కట్టావితలె నాడిది యొగయ భూమండలమును నెనమున మాపటి పండువెన్నెల చకోరపోత వితతికి బాపట్టు బోసిన విధముగా నొప్పారెను "గ్రామ గ్రామంబున నొక పామంతుని కిడిన దలుకదప్పరములు తిన్నె భేదిని గుంపటిలో దామరలవలె నట్టితటి" నొప్పారెను ఇప్పటి యుపమాన మెంత స్వతంత్రసుందరముగా నున్నది! కరగున శాలిమంజరులు పండి ముదురై వాడి ముంప్లతో గూడియుండును అవి విష్ణువు నిద్రమేల్కొని భూదేవిపై నడుగిడగా నామె మేన బొడమిన పులకలవలె నొప్పారెనట! ఇట్టి భావనా సౌందర్యము లేని పద్యమొకటియు నీ ఋతువర్ణనలందు లేదు ప్రతి పద్యమునందు నేదో యొక విశిష్టమైన భావవిశేషము గోచరింపకుండ నుండదు ఇందు సహజమైన భావనకంటె నసహజములు సమయబద్ధములు నైన యూహ లతిశయించినచోట్లును కొన్ని గలవు కాని యుదాత్తమైన గాంభీర్యముమాత్ర మెచ్చటను గొఱతపడి యుండలేదు.

రాయ లింత గంభీరముగా నీ వర్ణనల సాగించుచునే యొకొకచో శృంగారమిశ్రితమైన చక్కని హాస్యరసోక్తుల నల్లడించినపట్లును కొన్ని గలవు గంభీరముగా మొదలిడిన వర్ణన సాగి సాగి చివరికి దరహాసము కలిగించు సరసోక్తితో ముగియుట యిట్టి పద్యములలో గానబడు సరివాని వర్షకాలమున రవిజూచి కుకుచువారలకును గృహకలాపములకును దృష్టిమిన్నులకె నిలుచుట మున్నగు విషయముల వర్ణించుచు చివరికిది నాయన యెట్లు ముగించెనో చూడుడు

అతిథిసంఘంబునకు నీవిపట్టె యొకప
కగుపులే కలగమికి నాగట్టు లెసగ
మంటిమిద్దెలవారికి మనుపనులకు
నెలతి వానీనవారికి నిదుర లేకియె

పైయారంభమున కిటి యుపసంహృతి కలుగునని మనము భావింపము ఇట్లే వంటవంతు విల్లాంధ్ర శ్లోకమును వర్ణించి వర్ణించి యాతడా సీసమును,—

అభ్యపటముఖ్యులయ మెన్నరాల యాంకు
దారులయు మెన్నరంతిక కొరవనిక
వచన సాంధో గృహిణిరామి బశేకమురుడు
విశవిషాలె యార్య నౌగిలి రజ్జడిని గృహాలు

అని ముగించును. వేసవిలో శాంతు డొనరించు విరామ చేష్టలు చూడుడు దప్పికచే బ్రపజేరి యమ్మయక్కయని కూలుచు దోయి లొగ్గి ప్రపాప్రపాలిక లొసంగిన పానీయముచే వని తీర మందటి వాక్యము లెన్నిక యాతడు "శాయమబ్బలుస్ గడకొను కతుదీధిక లెగాదిగ చూడ" నారంభించునట! అట్టి పాంథుల జూచి పానీయము బోయు పాత్రముల మొగములపై విసరక సరసురాండ్రైన యాస్త్రీలు సన్నలచే నవ్వుచుందురట వారు నవ్వుట మాట యెట్లున్నను ఈపద్యము చదువునప్పుడు పఠితకు మాత్రము నవ్వు రాకతప్పదు

ఈవిధముగా రాయలవారి ఋతువర్ణనలు భావగాంభీర్యమునకును, ప్రకృతి పరిశీలన నైపుణికిని, సరస వాక్చాతురికిని నాలవాలములై యితర కావ్యములలోని వానికంటె నొకవిధమైన వైలక్షణ్యము కలిగియున్నవి అసలు రాయలవారి రచనమే ప్రౌఢమైనది ఈ వర్ణనలు మతింత ప్రౌఢములుగా నున్నవి ఒక్కొక్క ఋతువునుగూర్చి యింత భావసామగ్రి యాయన యెట్లు సమకూర్చినాయని చదువరుల కచ్చటచ్చట విస్మయము కలుగుచుండును కొన్నిచోట్ల నాతడొక వస్తువును వర్ణించి మఱికొంత దూర మేగిన తరువాత మరల నావస్తువునే వర్ణించుట కంగుకొనుచుండును ఒకే వస్తువునకు సంబంధించిన భావములన్నియు నొకచోట నుండుట సహజము అట్లుకాక యవి యందందు చెదరియుండుట కొంత వింత కలిగించును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారీ ఋతువర్ణనలలో నితర కవుల పద్యములు కూడ కొన్ని చొచ్చియుండవచ్చునని యొక సందర్భమున చెప్పియుండిరి ఇందలి భావవైచిత్రిని, వస్తుగ్రహణమందలి పునరుక్తిని దిలకించినచో నీయభిప్రాయము సమంజసమే యని తోపక పోదు వర్షకాలవర్ణనమున నడుగంప్లయు నింద్రగోపములయు వర్ణనములు రెండుమూడు చోట్ల గానవచ్చును శరత్తున దెల్లని మొయిళ్ళవర్ణనము పునరుక్తమైయున్నది వసంతమునందలి దోహదక్రియల వర్ణన మనేక కర్తృకమై యుండుట నవకాశమున్నది కవులతో ప్రసంగించు సందర్భమున నాయావస్తువులగూర్చి వారిచే బద్యములు చెప్పించి యందు దనకు రమణీయములని తోచినవానిని రాయలు తన కావ్యమున జొప్పించె నేమో యనిపించును కేవలవర్ణనలే కావున నట్లు చొప్పించినను గథాభాగమున విషయవిపర్యయము వాటిల్లదు అదియే యీ వర్ణన లింత దీర్ఘతరములుగా నుండుటకుగూడ హేతువేమో! కాని పద్యరచన మాత్రమంతట నొక్కమాదిరిగా నున్నది అప్రౌఢత, కూర్పు, పదప్రయోగము అన్ని పద్యములందును సమానమే అదియై యభిప్రాయమున కించుక బాధకము ఈ వర్ణన లెల్లవరిచే వ్రాయబడి యుండు జొచ్చినను రమణీయములును, అసాధారణములును, నుదాత్తములునై యున్నవనుటలో మాత్రము సందేహము లేదు.

# కోయిలమ్మ



శ్రీ కాఘూరి హనుమంతరావు

ఈ తొలిసంజవేళ నిప
 డేయిటు కోయని నిద్రపోవునా
లేగమనస్సులన్ నిదుర
 లేపెడువారలు?-ప్రాసఛందముల్
కై తలంటుచు నెంచుకొని
 కమ్మని తెన్గును బాడుచేయుమా
జాతిని నిద్రనుండి గుర
 జాడ కవీంద్రుడు లేపినట్లుగా

తొలిగాలుల కౌగిలులో
కిలకిల నగి, యుదయభాను కిరణమ్ములలో
మిలమిల మెరసెడి చిగురా
కులమాటున బాటపాడు కోయిలగంటిన్

నన్నపార్యుసమాసము కన్న, కీట్సు
'ఊహ'కన్న రవీంద్రుని 'ఉషము'కన్న
నామనోహరి మోవిపై నవ్వుకన్న
తీయగా, హాయిగా పాడె కోయిలమ్మ

"పలుకులందెల్ల మెత్తన తెలుగుపలుకు
తెనుగుకైతల మధురమ్ము తేటగీతి,
తేటగీతికకన్న నీ పాట యింపు,
ఆపకే ఆపకే నీదు అమరగీతి"

కర్కశ కఠోర శిలలెల్ల కరగిపోవ
నవని పులకింప మోడులే చివురులెత్త
కవుల హృదయాలు మారు మ్రోగంగ
 నిపుడు
జగతి నింపవె నీదు స్వచ్ఛందగీతి.

ఈ యుషోదయసౌందర్య మినుమడించె
సంధ్య నీగాన పారవశ్యతను దోగ

కోయిలా కోయిలా యెందుకే యివేళ
నీదుగానమ్ములోన విషాదగతులు?

పొంగి హృదయమ్ములోనుండి పొరలిపోవు
నీవిషాద మాకాశమంత నిండిపోయె
దాచుకోనేల నీవిషాదమ్ము నేడు
వింటివింటిని లే నీదు కంటినీరు.

చావు బ్రతుకుల మధ్య తేల్పంగలేక
మిగుల వేదనబడెడి హేమ్లెట్టు వలచి
ప్రేమమరణమ్ము పొందు ఒఫీలియాయు
నీవలెన పశ్చాగాబోలు

పాడవే పాడవే హృది పగిలిపోవ
మధురమధురాతి మధురమౌ విధురగీతి,
జగతి మధురకావ్యములు విషాదభావ
పూరితములై, నిట్టూరుపుల పుచ్చు
 నవియె.

క్షణము క్షణమును మారు నీ జగతియందు
నేడుమాత్రము మారకే యుండిపోవు-
కళ కళకారకే యానెడు నీగాన ఫణితి,
ఆపగారాని నాదు కళాపిపాస

నందగోపాలు వేణుగానమ్ములోన
లీనమౌ రాధికాసతి లీల నేను
గాన పారవశ్యతను లోకమ్ము మరచి
యెంతసేపుంటినో యేమొ యెవ్వడెరుగు?

మొయిలుసందులలోనుండి పయికివచ్చు
కిరణపటుభావ మొక్కటి మెరసె హృదిని
కలుగుగాక పునర్జన్మ, కలుగుగాక
అమరమాధుర్యమౌ కోయిలమ్మ బతుకు.

పోలేదు. చిన్నగా వెళ్ళి విశ్రాంతి తీసుకో! నీ కుమార్తెను పిలిపిస్తాను. నిన్ను ప్రాణపదంగా చూసుకుంటాను నన్ను విశ్వసించవూ?" అని మెహరున్నీసా ఆమె నోదార్చింది

సుబుకాదు విచారించగా సర్వసుందరి కుమార్తెతో ఆమె ముసలితాతగారు మాయమైనట్లు వార్త వచ్చింది. ఎంత వెదకించినా పత్తా దొరకలేదు.

లాలీతల్లి, సర్వసుందరి, మెహరున్నీసాకు కలికత్తె కాక తప్పలేదు ఆమె మరణించగలదు, కాని కసితీర్చుకోక చావడానికి హృదయం సమ్మతించడంలేదు.

దినమంతా సేవచేయడం—రాత్రి కసి తీర్చుకొందుకు ఉపాయాలు వెదకడం—ఈవిధంగా ఆమెజీవితం గడుస్తూ పోయింది. అప్పుడప్పుడూ తనకుమార్తెను చూడడానికి సుఖస్వప్నాలు కనడం కూడా అలవాటయింది

సర్వసుందరిని మెహరున్నీసా చాలా ఆదరించింది. ఆమె కేవలం పరిచారికమాత్రమే కాదు, ప్రాణసఖి, సలహా లిచ్చే మంత్రికూడా

సర్వసుందరి తలచుకుంటే విషమైనా యిచ్చి మెహరున్నీసా అంతాన్ని చూడగలదు చాలాసార్లు అలిసంగా కడతేర్చడానికి సమయాలు నిరీక్షించింది కాని, ఒక్కటే సుఖ నిద్రపోనిచ్చినందువల్ల, లాభం లేదు "ఆమె హృదయాన్ని చేతనైనంత దుఃఖపెట్టి గాని చంపగూడదు, అప్పుడే తన కసితీరడానికి అవకాశం దొరికినట్టు అసలు చావులో ఏముంది? జీవితాంతం ఏడ్పిస్తే చాలు! అందుకుపాయం?"— అనుకుంటూ కాలం జరిపింది

కొన్నిసార్లు, షేరాఫ్గనుకే విషమిచ్చి చంపితేనో?"—అనే ఊహకూడా ఆమెలో పొటమరించింది. మేహరు—అనాథగా మారిపోయి తన వలెనే యేడుస్తూ. "అబ్బే! అందులోనూ లాభం లేదు మేహరు హిందూ సుందరికాదుగా! ముసల్మానుసుందరి, తప్పక రెండో పెండ్లిచేసుకుంటుంది. ఆమె సౌందర్యం చిరకాలవైధవ్యాన్ని యాపువూసడానికి సహాయపడితీరుతుంది అప్పుడో?—ఈ విధంగా తర్కవితర్కాలుమితిమీరిపోయాయి. ఇంతకూ ఏవిధంగా నూ కసి తీర్చుకోలేక సర్వసుందరినిత్యనూతనోపాయాలు అన్వేషిస్తూంది సంవత్సరం మీద సంవత్సరం గడచిపోసాగింది.

## 2

అక్బరుపాదుషా అనంతరం సలీము సింహాసన మెక్కాడు జహంగీరు బిరుదుకూడా ధరించి వాడు. అతనిహృదయంలో అప్పటికీకూడా మెహరున్నీసా రూపం కంటక ప్రాయంగానే గ్రుచ్చుకొని ఉండిపోయింది. అతడామెనే మాత్రం మరచిపోలేదు

బర్ద్వాన్‌లో గడబిడ బయలుదేరింది సింహాలను వేటాడే వీరతాపకుడు షేరాఫ్గను 1607 మార్చి 80 తేదీన హతుడైనాడు ఈ హత్యలో జహంగీరు చేయి ఉందో, లేదో ఈశ్వరుడికే తెలుసు ఐతిహాసికుల్లో ఈ విషయాన్ని గురించి అనేకమైన మతభేదాలున్నాయి.

చచ్చేవాడు చచ్చినాడు. కాని, బ్రతికేవాళ్లకు బ్రదుకుదెరువునుగురించిన భయం పట్టుకుంది. చరిత్ర మనకు విశదీకరించే విషయ మేమంటే—మెహరున్నీసా మొగలాయి రాజమహలులో ప్రవేశింపక తప్పలేదు. ఆమెతో కూడా జులేఖా సైతం అక్కడే చేరింది

అంతఃపురంలో రాజమాత సన్నిధిలో (అంటే అక్బరు పట్టపురాణి దగ్గఱ) మెహరున్నీసా మెదలసాగింది

పూర్వచరిత్ర సమాంతం మార్చడానికి జహంగీరెన్నోపాట్లు పడినాడు కాని, మెహరున్నీసా గతించిన భర్తను తలచుకుంటూ, జహంగీరు సంబంధాన్ని తృణీకరిస్తూ, కాలక్షేపం చేయడానికి ప్రారంభించింది

పాపం! జహంగీరు హృదయంలోనో? ఆనాటి కానాటికి, ఆమెమీది వ్యామోహం పెరిగిపోసాగింది దినదినానికి మెహరు తృణీకారం కూడా అదే అంతస్థులో ఉండిపోయింది

అన్నివిధాలా ప్రయత్నాలు నిష్ఫలాలుకాగా, జహంగీరు తుదకు జులేఖా పాదాలమీద తన శిరస్సుపెట్టి యీవిధంగా ప్రార్థించినాడు "నీవు మెహరున్నీసాకు ఛాయవనే సంగతి తెలుసుకున్నాను ఆశ్చర్య మేమిటంటే!—ఛాయైనా ఒక్కొకసారి మనిషిని వదలి దూరమౌతుంది, కాని, నీవో! ఆవిడ నెప్పుడూ విడిచిపెట్టవు. నేడు భారతసామ్రాట్టు నీ పాదాలు పట్టుకున్నాడు; మెహరున్నీసాకు నిఖా కట్టించే భారం నీవు వహించాలి సుమా!—"

ఆనాటివఱకూ జులేఖా మనసులో, మెహరున్నీసాను విధవగానే ఉంచి తమాషా చూడవలెననే భావం ఉండేది. కాని, యిప్పుడో! భారత చక్రవర్తి తన పాదాలపై బడి ప్రేమభిక్ష పెట్టుమని ప్రార్థిస్తున్నాడు. ఆమె హృదయం కరగిపోయింది. వెంటనే సాధ్యమైన సహాయం చెయ్యడానికి జులేఖా చక్రవర్తికి వాగ్దానమిచ్చింది.

హిందూస్త్రీల సౌందర్యాన్ని కనులపండువుగా తిలకించింది కాని, లాలీ అందాని కెవ్వరూ సాటి రారు. జగద్విఖ్యాత సౌందర్యవతి నూర్జహాను కూడా లాలీ కాలిగోటికి సరితూగదేమో అనిపించింది హఠాత్తుగా ఆమె తన కుమార్తెను, "అమ్మాయీ! నీ వివాహమయిందా? కాలేదా? చెప్పు!" అని అడిగింది

లాలీ తలవంచుకొని ఊరకుంది

అంబరరాయి వెంటనే, "ఈమె వివాహమిప్పుడొక విషమ సమస్యగా పరిణమించింది హిందూ వీరుడెవడూ యీమెను వరించడానికి సాహసించడం లేదు ఇంతలో కాకగారు స్వర్గస్థులైనారు ఇంక నేనే యీభారం వహించవలసి ఉంటుంది—" అని వివరించింది

సర్వసుందరి విస్ఫారిత లోచన యుగళి సజలమయింది అంతలో ఏదో స్ఫురించినట్టై ఆమెలో ఆనందం తాండవించింది "సోదరుడు భీమసేనుడెక్కడ?"—అని ఆమె ప్రశ్నించింది

అంబరరాయి భీమసేనుని పిలుచుకొని వచ్చింది సర్వసుందరి అతని చేతికి రక్ష కట్టింది భీమసేనుడు—"సోదరీ! నీకోసం నే నెంతటి త్యాగానికి సిద్ధంగా ఉన్నా" నంటూ ప్రతిజ్ఞ చేసినాడు

"అన్నా! నేను నీ కెంతో కృతజ్ఞురాలను జన్మజన్మాంతరాలకైనా నీ ఋణం నేను తీర్చుకోలేను నా కుమార్తె కాశ్రయమిచ్చి నీవు నన్ను దాసిని చేసుకున్నావు—" అనింది ఆమె

"చెల్లెలా! అన్న కర్తవ్యమైనా ఋణ పడిపోవడం లోకంలో కద్దా? చెల్లెలి బిడ్డను సంరక్షించడంలో నేను చేసిన ఉపకార మేమీ లేదు ఇది నా కర్తవ్యమే సుమా! ఏ రోజున నా చెల్లెలిపై జరిగిన అత్యాచారానికి నేను కసి తీర్చుకుంటానో, ఆ రోజునగాని నా ఆత్మకు శాంతి చేకూరదసుమీ!"—అని భీమసేనుడు పలికినాడు

"నీవు వీరశేఖరుడవు, నేనో, అబలను, విజాపికి నా హృదయంలో ద్వేషాగ్ని రగులుతూనే ఉంది ఏనాడు నా ప్రాణప్రదమైన భర్త అన్యాయంగా హత్యచేయబడినాడో, ఆనాటినుంచి నేటిదాకా నా హృదయంలో సంతోష మనేది లేదు వినా, నా కనులవెంట అశ్రువులు మాత్రం ఎన్నడూ పొంగి ఉండవు. అంగిట అమృతమూ, ఆత్మలో విషంగా నేను జీవితాన్ని గడుపుతున్నాను. దుఃఖాన్ని ప్రకటించకపోయినా నేను పోతేమి, ఇప్పటికి నా హృదయం ప్రశాన్తమయింది. కాబట్టి కనులు బాష్పపూరితాలయినాయి. లాలీ సందర్శనం నన్ను వివశురాలిని చేసింది. అమ్మాయి వివాహమూ, హత్యకు ప్రతీకారమూ—ఈ రెండూ జరిగితే గాని నా హృదయాగ్ని శాంతించదేమో? ప్రతీకారం కోసమే నే నింకా జీవించి ఉన్నానో!—

'కపట జీవిత మర్మ మిదో?
కనిపించనీ తెరచాటు!
అంతరంగ రహస్య మొక్కటి;
వింతవాలక విజయ మొక్కటి—

"ఐనప్పటికీ—అన్నా!—ఏవిధంగా తీర్చుకోగలనో తోచటం లేదు మార్గదర్శివి కావా!—" అని సర్వసుందరి తన హృదయం విప్పి భీమసేనుని ఎదుట పెట్టింది

"అమ్మాయీ! నీకు తెలిసే ఉంటుంది, నూర్జహాను తన కుమార్తెను సింహాసన మెక్కించడానికనేక విధాల ప్రయత్నాలు సాగిస్తూందని—ఆమె యత్నాన్ని వ్యర్థం చేయడమే మన కర్తవ్యంగా భావించు. ఇందుకోసం నీవూ, నేనూ, యువరాజైన ఖుర్రము పక్షంలో చేరకతప్పదు. ఖుర్రమే సింహాసనారూఢుడైతే నూర్జహాను విటపిస్తూ చాలకాలం జీవించకపోదని దృఢంగా నమ్ము! అంతకంటె కావలసిందేమి?"—అని భీమసేనుడు బోధించినాడు

"నావంటి అబలవల్ల కాగల సహాయమైనా ఏముంటుందో తెలిసినావు కావు," అని సర్వసుందరి ప్రశ్నార్థకంగా చూచింది.

"నీవల్లనే కార్య సాఫల్యం కాగలదంటూ నేను విశ్వసిస్తున్నాను"

"ఏవిధంగా?"—

"నూర్జహాను మిక్కిలి చతురురాలని వినికిడి. నీ విందులోనూ ఆమెకు తీసిపోవనీకూడా నా నమ్మకం. ఆమెమీద నీవు కసితీర్చుకోడానికి సిద్ధంగా ఉన్నావుగా?"

"నిజమే; ఐతే?"—

"ఆ మాత్రం చాలు!—ఇంతవరకూ చక్రవర్తి రహస్యాలు మాకు తెలుపగల గూఢచారిణి లేదే, అని ఖుర్రం విచారిస్తున్నాడు అక్కడ జరిగే రహస్యాలన్నీ నీవు అంబరరాయిద్వారా మాకు తెలుపుతూ ఉంటే, అన్ని విధాలా సహాయపడిన దానవౌతావు"

"ఇంతేనా సహాయం?"—

"ఏమనుకున్నావో, అమ్మ!"—

"అన్నదైన నీవు కోరే బహుమతి ఉన్నాను. కాబట్టి, షహజాదా ఖుర్రం యీశరప్రయాణానికి పూనుకోవాలి"

"షహజాదాఖుర్రం ఏదో యొక్కనాడు రాగలడు అతనిచేతనే వాగ్దానం చేయిస్తాను"

మరునాడు ఖుర్రం రానేవచ్చినాడు. రాగానే సర్వసుందరి దర్శనానికి వచ్చి, నమస్కరించినాడు ఆమె అడిగింది

"షహజాదా ఖుర్రం! నేను మీకు సహాయ పడితే నాకు మీరిచ్చే బహుమానం ?—

ఖుర్రము వినయుడై, "అమ్మా! తామే మము గురించో, అడగండి! తలతో చేస్తాము," అంటూ మాట యిచ్చినాడు

"ఖడ్గ హస్తులై ప్రమాణం చేయండి!"—

ఖుర్రము అదేవిధంగా ప్రమాణం చేసినాడు

మరునాడే సర్వసుందరి తన తమ్మునితనవదలి ఢిల్లీకి బయలుదేరబోతూ, 'అన్నా! సోదరి సంరక్షణలో జాగరూకుడవై ఉండు! నాకు సెలవా ?" అనింది

"సోదరీ! నిశ్చింతగా వెళ్ళిరా! ఇక్కడి జోగీశ్వరుల వచన ప్రభావంవల్ల నాకోడలు భారతవర్ష సామ్రాజ్ఞి కాబోతుందని నమ్మకం సరేనా ?" అని భీమసేనుడు నవ్వినాడు

## 5

కొన్నాళ్ళపిదప అంబరబాయి, మహలునుంచీ భీమసేనునకు ఒక ఉత్తరం తెచ్చింది.

"అన్నా,

రహస్యాతి రహస్యమైన మీ పన్నాగమంతా నూర్జహానుకు తెలిసిపోయింది. షహజాదా పర్వేజ్, సామ్రాజ్య సేనలతో వెంటనే బయలుదేరి మీ మీదికి రాబోతున్నాడనే సంగతి నాకు తెలియ వచ్చింది మొదట మిమ్మలను మోసగించే నిమిత్తం కొద్దిసేనమాత్రమే వచ్చి యుద్ధాని కాహ్వానిస్తుంది. మీరు పోరాడే సమయంలో హఠాత్తుగా మరొక పెద్దసేన ఖుర్రమును ముట్టడించి హతమార్చడానికి సిద్ధమౌతుంది. ఖుర్రం శిరస్సుకు నూర్జహాను కట్టిన వెల రెండులక్షల మొహరీలు మాత్రమే. ఈ సేన లేచి రాకముందు, నీ దగ్గరకు ఒక దూత వస్తాడు. అతడు నిన్ను మోసపుచ్చి, అరణ్యంలోకి తీసుకోపోవడానికి ప్రయత్నిస్తాడు. అక్కడ నిన్ను హతమార్చడానికి పన్నాగం పన్నబడింది.

పర్వేజ్, నాట్యగానాలంటే ప్రాణా లిస్తాడు కాబట్టి, యుద్ధప్రయత్నానికిముందే అతని నే నాట్యకర్తె చేతిలో హతమార్పించడానికి సన్నాహపడు! నా ప్రతిమాటా జ్ఞాపక ముంచుకో! ఏమాత్రం ఏమరినా సరే, అనుకున్న కార్యం విష మించిపోతుంది సుమా!

నాలిని కలుసుకోడానికి హృదయం తత్తరిస్తూంది. ఐతే, యీ సమయంలో మహలు వదలడం మంచిది కాదు

నీ సోదరి,

—సర్వసుందరి"

జాబు చదువుకుంటూనే భీమసేనుడు, మహబత్తాను ఖుర్రమునకు సమస్తమూ తెలిపి, తగిన సూచన లిచ్చినాడు

అదే సమయాన ఒక దూత రోజుకుంటూ, రొప్పుకుంటూ రానేవచ్చినాడు ఆ దూత భీమసేనునితో, "షహజాదా ఖుర్రం, అరణ్యంలో పులులను వేటాడుతూ, కూలిపడిపోయినాడు తమ రాక అగత్యమని భావిస్తున్నాడు—" అన్నాడు

తక్షణం భీమసేను డా దూతను పట్టి బంధించమని అనుచరుల నాజ్ఞాపించినాడు అనంతరం తగిన సిబ్బందితో అరణ్యానికి వెళ్ళి చూచినాడు అక్కడ ఖుర్రం పత్తాలేడు సరికదా! నలుగురు సిపాయీలు తన్ను చంపడానికి సిద్ధంగా ఎదురు చూస్తున్నారు ఆ నలుగురూ వెంటనే సప్రాణంగా పాతిపెట్ట బడ్డారు.

అంబరబాయి నాట్యకర్తెవేషంతో బయలుదేరి షహజాదా పర్వేజు శిబిరాలో హాజరయింది. నాట్య గానాలకు అనుమతించమని ప్రార్థించింది.

పర్వేజు వెంటనే అంగీకరించినాడు అంబర బాయి నాట్యగానాలతో అతనికి మత్తెక్కించి, సిపాయీలను మోసగించి, మంచి అవసరం చూచు కొని, కటారికి క్రతువు బలియిచ్చింది అందరూ కండ్లు తెలచేలోపల తప్పించుకొని పారిపోయింది కూడా

పర్వేజు మరణంతో నూర్జహాను—జహాంగీరుల పన్నాగమంతా మొహం మొత్తింది

సర్వసుందరికి ధన్యవాదా లర్పిస్తూ ఖుర్రం స్వయంగా ఒక లేఖ వ్రాసినాడు.

పర్వేజు మరణించిన జహాంగీరు దుఃఖసముద్రంలో మునిగిపోయినాడు. నూర్జహాను దుఃఖంలో ప్రసన్నత కూడా తొంగిచూస్తుంది. ఒక కంటకం తొలగిపో

తొలగిపోలేదా?—అనుకుంది. ఇంక ఖుర్రం ఒక్కడే మిగిలివాడు!—కాని, ... కాని...

జహాంగీరు దీర్ఘాలోచనలో పడిపోయాడు. తను రహస్యమంతా భయపడేవాడుకు ఏవిధంగా తెలిసిందో? మహలులో ఖుర్రం పక్షాన గూఢచారుల జాడలు కని పెట్టమని అతడు ఆజ్ఞాపించివాడు.

రెండు రోజుల్లో ఖుర్రం వ్రాసిన ధన్యవాదాల లేఖ, చక్రవర్తి సన్నిధానంలో ఉంచబడింది ఖుర్రం హస్తాక్షరాలు గుర్తించిన తర్వాత చక్రవర్తి ఆ లేఖను నూర్జహానుకు పంపి ఊరకున్నాడు. నూర్జహాను ఆ పత్రాన్ని చదివి అగ్గి లేకుండా మండిపడింది జాలేఖాను వెంటనే తన గదిలోకి రప్పించింది.

జాలేఖా నూర్జహాను ముఖావలోకనంలోనే, ఏదో విషమించి ఉంటుందని గ్రహించగల్గింది నూర్జహాను పండ్లు పటపట గీటుతూ, "ఏమే, విష నాగమా!—ఇంతకాలమూ నీ విషం దిగలేదూ?—" అని గర్జించింది

జాలేఖా భయంతో గడగడలాడుతూ, "ఈ సేవకురాలి తప్పేమిటమ్మా? మలికా సాహెబా కింతటి దురాగ్రహ మెందుకోనమ్మా?" అంటూ సవాలు చేసింది

"నిన్ను నమ్మి నా రహస్యాలన్నీ నీతో ఆలోచించడ మెందుకే ననుకున్నానా? నీవు నా మీదనే కత్తి కట్టడానికి పూనుకున్న సంగతి చూస్తే—ఆశ్చర్యంగా ఉంది"— అని అంగలార్చింది నూర్జహాన్

జాలేఖా ఆమె పాదాలు కండ్ల కద్దుకుంటూ, "ఎవరు నామీద చాడీలు చెప్పి, మలికా అనుగ్రహానికి దూరస్థురాలిని చేయదలచినారో?" అనింది

"నీవు సహచారిణి రూపంతో ఉన్న కాలసర్పానివి"

"నాదోషం?"

"మహలులోని వార్త క్రమంగా తెలిసి పోయింది షాహజాదా భర్యాలకు హెచ్చరించి వాళ్ళు, ఖుర్రమును బ్రదికించినావు. నా సామ్రాజ్యానికి అడ్డుగోడవైనావు ఇందుకు కూడా నీకు తెలిసి ఉందిగా?"

"తప్పు ఘోరమయింతే అపరాధికి మరణదండన తప్పదుగా? కాని, నా యౌవనమంతా నీసేవలో ధారపోసినాను వృద్ధాప్యంలో రుజువు లేని దోషానికి నన్ను బలిచేయకు[illegible]?"

"రుజువు కోరుతున్నావా? ఇదుగో! చూడు," అంటూ ఆ లేఖను ముఖాన విసరికొట్టింది, నూర్జహాను.

జాలేఖా ఆపత్రాన్ని చదువుతుంది ఆమె. దేహమంతా వణికిపోసాగింది ముఖంలో నెత్తురు చుక్కలేదు ఐనా ధైర్యం తెచ్చుకుంటూ, "ఈ లేఖ కృత్రిమం తన్నాగం. అంతమాత్రం కనుక్కోలేవా? మలికా సాహెబా!—" అంటూ ప్రారంభించింది.

"నేనేమి పసిపిల్ల ననుకున్నావటే? నోరు మాట్లాడితే నోదలు పెక్కరిస్తోంది. జాగ్రత్త! నీకు మృత్యుముఖమాత్రం తప్పదు కాని, యిన్నాళ్ళు నీవు చేసిన సేవకు బహుమానంగా—ఏదైనా నీ అంతిమ వాంఛ తీర్చడానికి సిద్ధంగా ఉన్నాను. అడుగు!"— అనింది నూర్జహాను గర్జిస్తూ

"ఈసేవకురాలు మరణానికి భీతిల్లదు మలికా అనుగ్రహం తప్పినతర్వాత బ్రదికిమాత్రం నేను సాధించేదేమిటి? ఫతేపూరు సిక్రీలో నా ప్రాణసఖి అంబరుబాయి ఉంది నాశవాన్ని ఆమెదగ్గర చేర్చడానికి అనుమతించండి! హిందూధర్మాన్ని అనుసరించి నేను దహనమై పోవడానికి వాంఛిస్తాను. కాబట్టి బ్రాహ్మణులకే నాశవాన్ని మోసుకుపోయేట్లు ఏర్పాట్లు చేయించండి! ఇదుగో! నేనే స్వయంగా విషంత్రాగి మరణిస్తున్నా," నంటూ జాలేఖా ఒక విధమైన పొడిని పొట్లాం తెరుచుకొని నీళ్ళుత్రాగింది. అరగంటసేపటిలో ఆమె స్పృహ తప్పి క్రిందబడి పోయింది.

నూర్జహాను ఆజ్ఞానుసారం సర్వసుందరి దేహం బ్రాహ్మణుల స్వాధీనం చేయబడి, ఫతేపూరు సిక్రీలోని అంబరబాయికి చేర్చబడింది. అక్కడహిందూ ధర్మప్రకారం దహనసంస్కారాలు జరిపించవలసిందని సందేశంకూడా పంపబడింది.

## 6

ఇతిహాసాల్లో లిఖించబడ్డ రీతిగా మహాబత్ఖాను జహాంగీరును పట్టుకొని, బలవంతంగా సామ్రాజ్యాధికారం ఖుర్రంపరం చేయబడ్డట్టు వ్రాయించుకోడమూ నూర్జహాను భర్తను మళ్ళీ విడిపించుకొని, మహాబత్ఖాన్ కోసం కడపటిసారి ప్రయత్నించడమూ జరిగినాయి. ఈ సమయాల్లో జహాంగీరు విశేషంగా మదిరాపానం చేసేవాడని, అతని ఆరోగ్యమంతకంతకూ క్షీణమౌతూ పోసాగిందని, చరిత్రలే తెలుపుతున్నాయి. ప్రజలు కూడా చిరకాలం జహాంగీరు బ్రతకలేడనే సంగతి తెలుసుకున్నారు. గాలిమార్పు దానికి [illegible] ప్రయాణం నిశ్చయించబడి, అంతా తయారయ్యే సమయంలో నూర్జహాను కిదంగా లిఖింపబడిన పత్రికొకటి అందింది.

శ్రీ మహారాణ్యవర్యా,

నీకూ నాకూ సంబంధ మీనాటితో తెగిపోయింది. నీవు నీ సౌందర్యగర్వంలో విర్రవీగుతూ నా భర్తను హత్యచేయించి, నన్ను దాసిగా చేసినావు. నా యౌవన భోగాలన్నిటినీ నాశనం చేసినావు. తల్లికి బిడ్డా బిడ్డకు తల్లీ లేకుండా చేయించినావు నన్ను కనాకష్టంగా పోషిస్తూ రొట్టె ముక్కతో సంరక్షించడమే మహోపకారంగా భావించినావు అధికారం హస్తగతమైనదనే పొగరుతో, యిష్టానుసారం చలాయించ సాగినావు ఇంతైనా నే నోర్చుకున్నాను ఎందుకో తెలుసా? నీమీద కసితీర్చుకోడానికే. ఎవతె నా యౌవనాన్ని సర్వనాశనం చేసిందో, ఆ పాతకురాలి వృద్ధాప్యాన్నైనా నాశనంచేయక నేను వదలగలనా? అందుకై మహలులో నిప్పుపెట్టించి, రాజధానికి తోడ్పడసాగినాను ఆ మంటల్లో నీ వివ్వాడు దహించుకుపోతున్నావుగా? నీవు నన్ను పరాధీనగా నిర్బంధించి మరణ దండన విధించినావు మూర్ఖురాలా! నేను విషపానం చెయ్యలేదు పంద్రెండు గంటల సేపుమాత్రమే స్పృహలేకుండా చేయగల ఔషధాన్ని సేవించి, నీ బంధాన్ని తప్పించుకున్నాను నే మద పానం కాలేదు ఇక్కడి నా బంధువులు నన్ను రక్షించినారు స్పృహవచ్చి కండ్లు తెరిచేసరికి నేను సరిగ్గా నా సహోదరుడైన క్షేమసేనుని సముఖంలో ఉన్నాను

కిరాతకురాలా! నీమీద పగ సాధించడానికే నే నిన్నాళ్ళనుంచీ జీవించగలిగినాను ఇప్పుడు నిన్ను నే నడుగుతున్నాను ఏమిటి నీకు శిక్ష? నీవు మరణమే కోరినా, నేను కాదంటాను నిన్ను సజీవంగా కాల్చి కాల్చి నేను కనులారా చూడదలచుకున్నాను. అప్పటికే గాని నా హృదయం శాంతించదు.

ఇంకో మాటమాత్రం విను! షాహజాదా ఖుర్రం నా సహాయమర్థించి, నే నడిగిన బహుమానాన్ని నా కివ్వడానికి ప్రమాణం చేసినాడు అతనికి సహాయపడటంలో నేను నీవల్ల దేమీ కోరలేదు. అతని ఆశ్వమేమో తెలుసా? నా కూతుర్ని పత్నిగా చేయడమే. నే నందుకు సమ్మతించి, నా ముద్దులకూతురి నతని కిచ్చి వివాహం చేసినాను ఆమె 'ముంతాజ మహలు' పేరుతో సామ్రాజ్ఞిత్వాన్ని అలంకరిస్తుంది అప్పుడు నీ కూతురో? అంధకార మందిరాల్లో ఒంటిగా ఖైదు చేయబడుతుంది నీ అల్లుడు సహా ఖైదులో ఉండి, నీ జీవానికి ఏడుస్తూ కాలం గడుపుతాడు, నీవు జీవించి ఉండి యీ దృశ్యాలన్నీ చూస్తూ విచారపడగలవు. జహాంగీరు ఆయువు తీరిపట్టిగా! ఈ కలాపమంతా జరగడానికి ఎంతో కాలం పట్టదు

భావిభారత సామ్రాజ్ఞి మాత,
—సర్వసుందరి"

కాశ్మీరు యాత్రానంతరం జహాంగీరు వ్యాధి పీడితుడై మరణించడం చరిత్రప్రసిద్ధమే నూర్జహాను ఆ సంగతి బొక్కనీయకుండా అతని శరీరాన్ని ఏనుగుమీద ఉంచి, ఊరేగింపుతో లాహోరు వచ్చింది కాని, సత్యం దాగుతుందా? మహాబత్ఖాను ఖుర్రమును పిలిపించి, వెంటనే సింహాసన మెక్కించినాడు సామ్రాజ్యకాంక్షగల మొగలు కుటుంబీకులందరూ కడతేర్చబడినారు షహర్యారూ, నూర్జహానూ ఏమీ చేయలేకపోయినారు సర్వసుందరి ఆజ్ఞానుసారం షహర్యార్ అంధుడై బందిఖానాలో ఉంచబడినాడు అతని బీబీ పెద్ద గదిలో బంధించబడింది నూర్జహాను మహాలులోనే నిర్బంధితురాలయింది అనుకున్నట్టుగానే లాలీ, సామ్రాజ్ఞి పదాన్ని అందగలిగింది

సర్వసుందరి కడపటిసారి నూర్జహానును దర్శించి సలాము పెట్టి నిలుచుంది "ఏమే, ద్రోహి! ఇదంతా చూడడానికే గదా నీవు జీవించింది? ఇప్పటికి నీ కన్నీరు చూచి నా హృదయం శాంతి వహిస్తోంది రూపగర్వంతో నీవు చేసుకున్న దాని ఫలితమంతా అనుభవించు! ఛీ! నీ ముఖం చూస్తేనే పాపం లభిస్తుంది"—

నూర్జహాను తలవంచుకుంది కన్నీరుమాత్రం కాల్వలుగట్టి పారంభించింది తర్వాత సర్వసుందరి నెవ్వరూ చూడలేదు ఆమె బర్హాన్పూరుకు వెళ్ళి, తనభర్త షేర్ఖాన్ చేత వధింపబడ్డచోటనే చితి పేర్చుకొని, భస్మమైపోయింది.



# ఉదయగిరి నవాబు దానపత్రిక



శ్రీ పొంగూరు సూర్యనారాయణ శర్మ

శ్రీ మనుమసిద్ధి మహారాజ పాలితమై, కవి బ్రహ్మ కవితా కలితమై, ఖడ్గతిక్కన భుజబల రక్షితమై పావన పినాకినీ ప్రవంతికల పూతమైన నెల్లూరు మండలమున ఉదయగిరి దుర్గము చరిత్ర ప్రసిద్ధిగాంచినది. ఇయ్యది నెల్లూరునకు పశ్చిమోత్తర దిగ్భాగమున ఏబదిమైళ్ళకు లోపుగ నున్నది. ఈ దుర్గము పర్వతాగ్రమున శత్రుజన దుర్భేద్యముగ నిర్మింపబడినది. కొంతకాలము దీనిని గజపతులాక్రమించి పాలించిరి. శ్రీ శ 16 వ శతాబ్దమున శ్రీ కృష్ణదేవరాయలు ఉత్తర దిగ్విజయమునకై తిమ్మరుసుచే పురికొల్పబడి యపార సైన్యసమేతుడై ప్రప్రథమమున నీ దుర్గమును ముట్టడించెను. దీని ముట్టడి సుమారు పదునెనిమిది నెలలు సాగెను. శత్రువు లెంతకాలమునకు లొంగనందున రాయలు, కొండ మరుసయ్యయను సేనాని అతి శ్రమకోర్చి కొండయు పగులగొట్టి మార్గమేర్పరచి దుర్గమును స్వాధీనము చేసికొనిరి, కొండమరుసయ్యను దుర్గాధ్యక్షునిగ జేసి రాయలు కొండవీటి విజయ యాత్రకేగినను విషయము చారిత్రకు లెఱింగినదే. రాయలచే సంవత్సరమునకు పైగా ముప్పతిప్పల పెట్టిన దీ దుర్గమని వేఱుగ చెప్పవలెనా?

17 వ శతాబ్దారంభమునకే హిందూ ధర్మ సంరక్షకమైన విజయనగర సామ్రాజ్యము ఛిన్న భిన్నము కాగా వారి పాలనలో నుండిన దుర్గములు మహమ్మదీయుల పాలయ్యెను. ఉదయగిరికూడ అట్లే నవాబుల పాలనలోనికి వచ్చెను. నేడిది ఉదయగిరి తాలూకాగా ఎన్నబడుచున్నది. ఈ ప్రాంతమున కంతయు పూర్వము ముల్కనాడను పేరుండినటుల ప్రాచీన పత్రములవలన తెలుచున్నది. దీనికి ముల్కనాడను పేరెట్లు వచ్చెనను నది విచారణీయమైన అంశము. నానావిధ చారిత్రకులచే వదలివేయుచున్నారు, ఈ నాటిలో నుండిన బ్రాహ్మణులు ముల్కనాడు (ముల్కినాడు) వారని ప్రసిద్ధినందిరి. వీరు క్రమముగ కడప మండలమునకు మఱి యితర మండలముల కేగిరి. సంగీత లోకమున భక్తలోకమున చిరకీర్తి గాంచిన కాకర్ల త్యాగరాజు తాత గిరి రాజకవి నాయక రాజుల కాలమున తంజావూరున కేగెను. అట్లే అనేక కుటుంబములు మధురాది దాక్షిణాత్య మండలముల కేగి నివాసముల నేర్పఱచు కొనిరి. నేటికిని వారు ముల్కినాటి వారమని చెప్పికొనుచున్నారు. చిరందబు నాటికి నూరుపాళ్లు ఆంధ్రులు ఉదయగిరి మండలమున (ముల్కనాటి) నివసించిన విప్రులు విశేషముగ వేదశాస్త్రాది విద్యలలో పరినిష్ఠిత పాండిత్యముగలవారై యుండినందుననే దేశాంతరములకేగి అచటి ప్రభువుల మెప్పించి ధృతిని గడించిరను విషయము నిస్సందేహము.

ముల్ ముల్క అను పాదుషా పాలనలో నుండినందున నీ దేశమునకు ముల్కనాడను పేరు వచ్చెనను చున్నారు. ఈ వ్యుత్పత్తి పూర్వోత్తర విరుద్ధముగ నున్నది. రాయలనాటికే యిచటి విప్రులు ఈ పేరుతో ప్రసిద్ధి వహించి యుండినటుల తెలుచున్నది. తత్పూర్వమీ దుర్గమును ముల్ ముల్క పాలించెనా? ఆధారములు లేవు. ఈ ముల్ ముల్క ఎవరు? ఏది యెట్లున్నను ఆంగ్లేయు లీదుర్గము నాక్రమించుకొనునప్పటికి ఇది మహమ్మదీయుల పాలనలో నుండినది. వారు మహమ్మదీయుల నోడించి, అచటి రాజ వంశీయులకు భరణమిచ్చి స్వాధీనము గావించుకొనిరి. ఇప్పటికి నాయూర మహమ్మదీయులే అధిక సంఖ్యాకులై యున్నారు.

ఇచట పాలించిన నవాబులు హిందువులయెడ వైరము చూపక యచటి పండిత బ్రాహ్మణుల పోషించి తోటాది వాటిక మడి మాన్యముల నొసంగిరి. ఉదయగిరికి పశ్చిమమున పొంగూరు అను గ్రామము శ్రౌతస్మార్త విశ్వకర్మ విశిష్టాగరిష్ఠమై, యజ్ఞయాగాది కర్మ వరతంత్రమై, విశ్వామిత్రగోత్ర

భూమపవిత్రమై తన్నాకొక్కన విప్రకుటుంబ మొకటి యుండెను. అద్వైత హిందూ సాంప్రదాయము నను సరించిన సంయుక్త కుటుంబము. అందు కనుమళ్ళ వారు, పేరుభొట్లువారును గలిసియుండిరి ఇందు కను మళ్ళ ఎల్లు భొట్లు యజుర్వేదము నధ్యయనించి, సాహి త్యమునందు ప్రవీణుడై శిష్యబృందమునకు విద్యగ నేర్పుచు జీవించెనట అతడు క్రీ శ 17 శతాబ్దిలో నుండినవాడు అప్పుడా ప్రాంతమున వర్షములేక పాడిపంటలు శూన్యమై జనుల జీవనము దుర్భరముగ నుండెను వీరికి నానాటికి జీవనము దుర్భరము కాగా, బియ్యము లేనందున నింట జొన్నసంకటియే శరణ్యమయ్యెను ఎల్లు భొట్లు భార్య పిలుపుకు విస్త రిలో జొన్నసంకటిముద్ద వడ్డింప నాతడు తినలేక అట్టే దీనవదనముతో భార్య మొగము చూచెనట ఆమెయు వెంటనే "ఏమి చేయుమందురు పిల్లలు ఏడ్చి ఏడ్చి మ్రింగలేకున్నారు మీరేమో వేదపారా యణం పాఠాలతో కాలం గడుపుతూ యిల్లు వదల కుంటే బియ్యం ఎక్కణ్ణుంచి వస్తాయి, ఏ రాజునో ఆశ్రయించి యింత వరిమడి సంపాయించక పోతిరి దాహమైనపుడు బావి లేక పోయెనే అనుకుంటే యెలా ? తినండి" అన్నదట ఆతడున్న పాళముననే లేచిపోయి ఆనాడెట్లో గడిపెను మరునాడు కాల కృత్యముల నిర్వహించుకుని కొతలనాటి శాల్వ భుజ మున ధరించి హుటాహుటిని ఉదయగిరికి ప్రయాణ మయ్యెను భార్య చూచుచు ఎచటికి ? అని యడు గుట దుశ్శకునమని యూరకుండె ఎల్లు భొట్లు మధ్యాహ్న మగుసరికి ఉదయగిరి దుర్గమును చేరి బజారముకడ నున్న భటులను చూచి "నవాబు దర్శనం కావలెను" అనగ వారు "శాస్త్రి బిచ్చగాడు బ్రాహ్మణుగదుట" అని గేలిచేసి నవ్విరట ఎల్లు భొట్లు ఉడుకుడుకు పింజముగావున వారిని త్రోసి రాజన సాగవారు ఈ కొలను బజారమున కద్దుపెట్టిరట ఈతడు రాజరాజేశ్వరీ యుపాసకుడు సిద్ధినందిన వాడుగాన వారి యాటి లొండొకటి అతనుకొను లాగున చేసి యూరక నిలువబడెనట భటు లీ కొలు రాక బ్రాహ్మణుడేమో చేసెనని గోలచేయసాగిరి జనులు గుంపులుగ చేరిరి అప్పటి యుదయగిరి పాల కుడు "షంషేరుల్ ముల్కుచే అలం హుశేను కుతుబుద్దీ ఖాను ఖాన్ సాహెబు." అతడీ బజారములోని సంగతి తెలిసి వెంటనే వచ్చి యెల్లు భొట్లను లోనికి గొనిపోయి యుచితాసన మొసంగెనట అంత నీతడు మంత్రా క్షతల నొసంగి,

"దుర్గమేద్యోదయగిరౌ, ఖానుర్భాను రివోదితః

తస్య ప్రకాశనశ్శా, వ్యాప్తి శః కమలంమనః"

అని పలికి రాజును మెప్పించెనట. దుర్గాధిపతి యాతని మహిమ నుండే యెఱింగిన వాడగుటచే "తమ కేమి కావలె ? ఏలవచ్చితిరి ? అని యడుగ" మా గ్రామం చుట్టుపట్ల ఎక్కడా వర్షాలు లేవు కుంటలు చెరువులు వట్టిపోయి ఒక గింజైనా పండుట లేదు మేము శ్రౌతకర్మలు చేసేవారము బియ్యము లేకున్న జరుగదు పిల్లా జెల్లా మాడిపోవుచున్నారు. తమరు దయచూపి వరిమడి పెన్న ప్రాంతంలో ఇప్పించండి" అని యడుగ నవాబు వెంటనే దివా నుతో నాలోచించి అల్లూరులో (ప్రస్తుతం కోవూరు తాలూకా) మీకు భూమి యిచ్చేలాగున ఆజ్ఞలిచ్చాము మీరు సుఖంగా జీవించండి" అని గౌరవించి పంపగా ఎల్లుభొట్లు అల్లూరు గ్రామమునకు కుటుం బముగా బయలుదేరి చేరెను అప్పటికే కాపు కరణా లకు నవాబు ఆజ్ఞలు చేరియుండెను గనుక వారు వీరిని గౌరవించి యీ క్రింది దానపత్రికను వ్రాయించి యిచ్చిరని మా కుటుంబపు పెద్దలవలన వినినగాధ నిందుపొందు పఱచితిని

దానపత్రిక (హద్దు పత్రిక అని పేర్కొనబడి యున్నది) కాలము శాలివాహన శకవర్షము 16 18. నేటి అనగా 1952 క్రీ శ సమానమైన శాలివాహన శకవర్షము 1875లో వ్రాసి వేయ నీపత్రిక కాలము నేటికి 257 సంవత్సరములగుచున్నది అనగా క్రీ శ 1695 అగుచున్నది ఇట్టి పత్రికలో నుదహరింపబడిన ఏడుం విత్తనాం పట్టు వరిమడి మాన్యముగా నీయబడి నేటివఱకు మాన్యముగా ననుభవించుచున్నది ఈ పత్రిక మాయింట 257 సం నుండి శిథిలముగాక దాచబడియున్నది

ఈ పత్రిక చేతితో చేయబడిన కాగితముపై చక్కని ముత్యములవంటి తెలుగులిపిలో వ్రాయబడి చెక్కుచెదరక యున్నది రెండున్నర శతాబ్దిక పూర్వ మాంధ్రభాష, లిపి, అనాటి కుటుమ్మల మత పాండిత్యమునకు, భిన్నాన్రీతికి ధియ్యని

దృష్టాంతములగుటచే చారిత్రక విమర్శకుల వినోదార్థ మీ క్రిందదానిని పొందుపఱచు చున్నాను—

పత్రిక నకలు

శ్రీరాములు—

"స్వస్తి శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శక వర్షాంబులు ౧౬౧౫ అగునేటి బహుధాన్యనామ సంవత్సర మాఘ శు ౧౫ లు శ్రీ మద్యజవాది మట్కూరు నిరతులయ్యిన కనుమళ్ల యల్లుభొట్లు గారికి అల్లాయకొండ కరణాలు వ్రాయించి యిచ్చిన హద్దు పత్రికె మాజరమేమనగా అలంపూరు కుదు వర్తీ భానుసాహెబులవారు కనుక అల్లాయలో పొలంలో కింగ్గాంబ ౧౧౦ యేసుంబి త్తనాలు పట్టుకరి మడి రెండ్డు వరహాలకు కెడ్డిమాన్యం మీకు యిచ్చ మని సెలవు యిచ్చినారు గనుక ఆదేప్రకారం సదరు గ్రామపొలంలో కింగ్గాంబ ౧౧౦ యేస్తుం విత్తనాలు పట్టుమా బక్క పోలయచేను రెండ్డు వరహాలక్కు కెడ్డి మాన్యంగ్గా నిమ్కూరు చేసి యిచ్చినందుక్కు హద్దువయ్నం

పడమరకు నాగరాజు యానచేనికి పాకకొల్వ దక్షిణానకు సదరు కొలకు తూర్పునకు నాగరాజు చేను పడమరగని మొయినక పరియపరుజు ఉత్తరానకు పల్లావులిగలు కొలకు యీ హద్దులలోగా వుండ్డే భూమి మీ పుత్రపౌత్ర పారంపర్యయ్యం ఆచంద్రార్కం స్థాయిగా మాన్యంకింద్ద అనుభవించు కొని యీ రెండ్డు వరహాలు శెడ్డివాడాడుకు చెల్లించ్చి సుఖానవుండుకునేది దానపాలనయో మధ్యే దానా శ్రేయోనుపాలనం| దానాత్స్వర్గ మవాప్నోతి| పాలనాదచ్యుతం పదం

అక్కరాజు పెదయా
ళ్ళ వ్రాతకరణీకం
వ్రాలు—

ముత్తరాజు నారా
యణప్ప వ్రాలు-
అన్న దాత నారా
యణ వ్రాలు
అన్న దాత భాస్కర
య్య వ్రాలు
అన్న దాత చాళిరాజు
వ్రాలు-
యరబోలు బుగ్గా
రెడ్డి వ్రాలు-"

నేటి వ్రాత పద్ధతికి అనాటి పద్ధతికి గల వ్యత్యాసములు: వర్షా, మాఘ శు, కుదు వర్తీ తూర్పు అని నేడు వర్ష, మార్గశిర, కుదువర్తి, తూర్పు అని రేఫక్రింద పొల్లులను వ్రాయుచున్నారు అనాటి వ్రాతలో రేఫ పొల్లు ప్రయోగములుగా క రకారపొల్లు (పొల్లుగేక) యే వాడబడినట్లు తెలియు చున్నది అరబీ సంపర్కముచే "పత్రికె" అనుచోట పత్రిక అనుటకు మారు ఎకార విశిష్టముగ వ్రాయుట పారంపర్యం అనుటకు మారు పారంపర్యయ్యం అని యద్వయములు వాడబడెను చింత్యము. కింద్ద, చెల్లించ్చి, రెండ్డు అని కింద, చెల్లించి, రెండు అను టకు మారుగా వ్రాయబడి యుండుటచే, పద్యాంత్య పొల్లులు ద్విత్వ విశిష్టముగా వ్రాయునల వాటల ఎట్లు వచ్చెనో పరిశోధింపవలె

ఇట్టి ప్రాతప్రతులు అచటచట కొన్నిముల తరబడి యుండియుండె వచ్చును అట్టివి గలవారు ప్రకటించిన అనేక విశేషములు కన్పించి భాషా శాస్త్రజ్ఞుల కెంతయో తోడ్పడును.



# కడపటి వివేకం



శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు

చింతా సాగరానికి ఆర్థిక బాధలులేవు. తాత తండ్రులు ఇచ్చి పోయిన ఆస్తి బోలెడంత ఉంది. కుటుంబమైనా కనీసపు మెట్టు దాటిపోలేదు. అతను, భార్య, ఒకే ఒక బిడ్డడు. తనకి సొంతంగా బాధలు లేకపోడమే కాకుండా కొందరిలాగు ఇతరుల బాధలను నెత్తిమీద వేసుకొనే గుణంకూడా అతని దగ్గర లేదు. "పాపం! అదంతా సంఘసంస్కర్తల పని!" అని తెగ నవ్వుతాడు

చింతాసాగరానికి స్నేహితులైనా మితంగానే ఉన్నారు. అతనితో చర్చించడమంటే వాళ్ళకి సరదా! వాళ్ళతో వాదించడమంటే అతనికీ సరదాయే! దీనివల్ల ఒక రకమైన ప్రయోజనం లేకపోలేదు స్నేహితులకి కాలక్షేపం! అతనుమాత్రం తన అపూర్వాభిప్రాయాలను లోకంలో వెదజల్లుతున్నానని ఆనందిస్తూంటాడు

ఆరోజున వచ్చిన స్నేహితుడు చర్చకి కూర్చున్నాడు "అయితే లోకంలో పరస్పరలాభంకంటె మరొక మాత్రమే లేదంటావు నువ్వు! చిత్రంగానే ఉందే!" అన్నాడు మిత్రుడు.

"ఇదిగో! దీనికి మొదటి ఉదాహరణమూడు. నువ్వు ఇంటికి రాగానే నీకు కాఫీ కప్పు అందించేనా లేదా? నాతోమాత్రమే పనుండిన వ్యక్తి ఒకడు ఇందాక వచ్చిపోయేడు."

"ఏమిటని?"

"గోరక్షణాలకి చందాలట!'

"ఏమి, చందా వేసేనా ఏమిటి?"

"వాడు వృత్తమయేది చందా ఇస్తానా! నా అసలు అంకమేమిటంటే, వాడికి కాఫీ నీళ్లు నేనెందుకు ఇయ్యలేదు అన్న ప్రశ్నకి నా సమాధానం చెప్తున్నా. వాడికి నాతోనే అవసరం కాని నాకు వాడితో అవసరం లేదు."

"ఆ మాట నిజమేలే!"

"ఇందువల్లే ఇచ్చి పుచ్చుకోవాలి; ఇదిగో మీ ఆవుకి గడ్డి అంటే, ఇదిగో మీ అబ్బాయికి పాలు, 'మీరు రైలెక్కించండంటే, తమరు ముందెక్కండని మర్యాదలు, ఇదిగో మీ అమ్మాయికి పెళ్లికి రవికెల గుడ్డ చదివించండి అంటే, ఇదిగో, మీ ఇంటిలో అన్నప్రాశనకు వెండి చంచా అని బయలుదేరేయి. ఈ లోకంలో పరస్పరప్రయోజనం కంటె మరోకసుగుణ మున్నట్టు నాకింతకీ కనబడలేదు సుమా!"

"అయినా పోనిద్దూ! అంత ప్రయోజనవాదిగా ఉండకూడదు" అన్నాడు మిత్రుడు

"ఇదిగో ఇటాగు చూడు మనం ఆవులిని ఎందుకు పెంచుతాం? పాలు ఇస్తాయి కనక. వట్టి గొడ్డుకి గుప్పెడు గడ్డి వెయ్యమను చూతాం! కుక్కని ఎందుకు పెంచుతాం? ఇల్లుకాస్తుందని, కొత్తవాళ్లవస్తేనాడ వస్తే అరవనికుక్కకి ఒక్కకబళం వెయ్యమను చెప్తాను! మనం తోటలో ఎటువంటి మొక్కలిని పెంచుతాం? తిరిగి మనకి ప్రయోజన మున్నవాటిని మాత్రమే! కలుపు మొక్కలికి ఎవడు నీళ్లు పొయ్యమను! అట్లాగే తండ్రి కొడుకు నెందుకు పెంచుతాడు? ముందెప్పుడో తనని ఉద్ధరిస్తాడని కాబట్టి పరస్పర లాభంకంటె మరొక మాత్రమే లేదంటే నమ్ము."

"అయితే ధనికుడైన తండ్రికి తిరిగి బిడ్డలవల్ల ఏమి లాభముంటుంది?" అని మిత్రుడు ప్రశ్నించేడు.

"లాభం లేదు, గీభం లేదు" అని చేతులు వెల్లికిల చెప్పేడు సాగరం.

"మాతృప్రేమ, పుత్రప్రేమ అంటారు మరి అదేమిటి?"

"అవన్నీ తెలియనివాళ్లు చెప్పే అర్థంలేని మూర్ఖత్వం! ఉన్నదున్నట్టు చెప్పడానికి చిన్నతనం వేసి వాటికి పెద్దపేరులు పెడతారు పాపం! తల్లి పాయతో అనడానికి సిగ్గుపడి సాలగ్రామాలని, చేపలు అనడానికి బాధపడి జలపుష్పాలని అనడం లేదుటోయ్!"

"బాగా చెప్పేవులే!"

అతనితో మిత్రుడు మరికొంతసేపు వాదించి వెళ్లిపోయేడు.

మనుష్యుడు మనస్ఫూర్తిగా ఒక సిద్ధాంతాన్ని నమ్మకుండానే ఉండాలి కాని నమ్మితే మట్టుకు యథాశక్తిగా ఆచరిస్తాడు. చింతాసాగరం తన సిద్ధాంతాన్ని అనుసరించి ఎప్పుడూ కాకినా చెయ్యివిడిచి ఎరగడు.

అతను ఇటువంటిగట్టయితే, అతని భార్య అటువంటి గట్టు! ఆమె అతనితో తనకి చేతనయినంతవరకు వాదించింది కాని ఒప్పించలేకపోయింది. అంతే కాదు, అతనితో సమానంగా వాదించలేకపోయింది ఆ ఆడకూతురు. కాని ఆమె అతని సిద్ధాంతాన్ని ఎప్పుడూ నమ్మలేదు; తనకి నచ్చిన మార్గాన్ని ఎన్నడూ విడిచిపెట్టలేదు.

అతని కొడుకు గణపతి పిత్రార్జితానికి హక్కుదారుడు. బి. ఏ. పాసయేడు. పెళ్లీడు వచ్చింది కొడుక్కి. పెళ్లిచెయ్యక తప్పదు అన్నాడు తండ్రి. పెళ్లికోసం పిల్లలని వెతుకుతున్నారు. సాగరం తన ఇల్లాలితో "పెళ్లి అయిన మర్నాటినుంచే కొడుకు, కోడలి కాపరం వేరు, మన కాపరం వేరు" అన్నాడు.

అతని స్వభావం బాగా ఎరిగినది కాబట్టి ఆమె ఏమీ ఆశ్చర్యపోలేదు.

"అత్త కోడలి తగవులాటలు మనకి వద్దు మనకి పోరువద్దు, పొందువద్దు" అన్నాడు భర్త.

ఆమె ఇదివరకు దేనికేనా ఒప్పుకొంటేకదా ఇప్పుడు దీనికి ఒప్పుకోడానికి! "మనం మనుమలను, మనుమరాళ్ళను ఎత్తవద్దా?" అని అడిగింది.

"దూరంనుంచి చూడడానికి ఎవ్వరికీ అభ్యంతరముండదు!"

"ఇంటిలో ఉంటే ముద్దుముచ్చట తీరుతుంది కాని చుట్టాలలాగ చూసిరావడానికా!"

"అదంతా వ్యర్థమైన ఆలోచన!"

అతనితో వాదించి లాభం లేదని ఆమె ఊరుకొంది.

కొడుకు పూర్తిగా తండ్రి పద్ధతులలో పెరిగేడు. మంచి కట్నంతో కూడ పిల్ల రాగా, సాగరం కొడుక్కి పెళ్ళిచేసేడు. మూడు ముళ్లు పడ్డ రాత్రే చుట్టాలు, స్నేహితులు ఎవరి ఇంటికి వారు పోయేరు. ఆ రోజు మర్నాటినుంచే సాగరం శాస్త్రం ప్రకారం కొడుకుకోడలి కాపరం వేరు, తను కాపరం వేరు. కొడుకు ఆ సాయంత్రానికి గాని మరొక ఇంటికి మారలేదు. గణపతి కొత్త ఇంటిలో ఇంకా చేరడో లేదో, చేతి కొక జాబు అందింది. "నీవు పొద్దుటి నుంచి సాయంత్రం దాక మా ఇంటిలో మకాం చేసినందుకు అయిన ఛార్జి అయిదురూపాయలు. ఇది దాని తాలూకు బిల్లు" అని రాసి ఉంది. తండ్రి పద్ధతులలో ఆరితేరినవాడు కాబట్టి గణపతి ఆశ్చర్యపోలేదు. తండ్రికి డబ్బు చెల్లించి నగదు రసీదు అందుకొన్నాడు.

సాయంత్రమయింది. చింతాసాగరం కుర్చీ మీద కూర్చున్నాడు. ఇల్లంతా బావురుమంటూన్నట్టుగా తోచింది. గోడలు కళావిహీనంగా కనబడ్డాయి.

చీకటి పడింది. మామూల్గా కూర్చున్నట్టే దీపం లేకుండా కూర్చున్నాడు. ఏమిటో గాబరా అనిపించింది. "దీపం వెయ్యకపోడంవల్ల అయుంటుంది!" అని ఎలెక్ట్రిక్ దీపం వేశాడు. దీపం మునపటిలాగు గాక మసక మసకగా ఉన్నట్టు తోచింది. "అంతా మునపటిలాగు లేదేమి?" అతని కడుపులో ఖాళీ ప్రవేశించింది. "ఏమిటా!" అని భయాశ్చర్యాలు పడుతున్నాడు. "ఏమేనా విషాదం ఆవేశించిందా?" అని ప్రశ్నించుకొన్నాడు.

భార్య ఒక మూల చాప వేసుకు పడుకొంది. ఆమె మనస్సు మనస్సులో లేదు.

సాగరం తన అవస్థను ఆమెకు వర్ణించి చెప్పదలుచుకొన్నాడు. కాని మాటల కేమీ అందేటట్లు కనబడలేదు. తెల్లవారేక తన స్నేహితులకి చెప్పాలనుకున్నాడు కాని వాళ్లు పకపక నవ్వుకొంటారేమో అని సిగ్గుపడ్డాడు.

సాగరి అంతేనా! తప్పు తప్పు! మీరు అలాగు చెప్పకూడదు నేను అలాగు చెయ్యకూడదు." అన్నాడు. మిత్రులు సాకాకులై దయచేశారు.

అంతకు ముందు ఎప్పుడేనా చుట్టం చూపులకు వచ్చే గణపతి అనాటినుంచి ఆ రాకపోకలు కూడ కట్టి పెట్టేశాడు. "ఊరుకొన్న వాడిని ఊరుకోక, కోరి తలగోకుకొన్నావు" అని సాగరం మరింత దుఃఖించేడు.

రోజులు గడిచిన కొద్దీ సాగరం స్థితి విషమిస్తూంది అతనికి పరిస్థితులను ఎదుర్కొనే చేవ ఉడిగింది "జీవితమే అటువంటిది. ఈ బతుకే ఒక బాధ. దీనికంటె మరణం సుఖదాయకం" అని నిర్ధారించేడు అతని స్నేహితులు అతనికి అంత్యదశ సమీపించిందని వాపోయారు.

సాగరం తన సిద్ధాంతానికి ఎంతో పశ్చాత్తాప పడ్డాడు అది తనతో కుదమటితే బాగుండునని తాపత్రయపడ్డాడు పిలలో "నీవు నీబిడ్డలకి పెళ్లి చేసేటప్పుడు నాలాగువారికుటుంబాలకు చేయగాపెట్టి అవస్థలపాలు కావద్దు" అని ఆఖరిమాటలను చెప్పేడు

# కవితాంజలి



శ్రీ మొక్కపాటి కృష్ణమూర్తి

వన్నెలు చిన్నెలున్ వయసువాసియు చక్కదనాల ప్రోవుగా
క్రొన్నన చెల్వులుల్లసిల కోమల భాన విలాసరేఖతో
చిన్ని మెలుంగుతో సొగసు చిందిన తీయనిరేగు సూపగా
నన్నగ భావవీథికల సాగినయుగ్మలి కంజలించెదన్!

నడల హొరంగు చూపుల వణంగు వెసంగు తుళుంగలించదా
కడు విరబూసి సోయగముకాయు తురాయి పసందు కొమ్మనా
తడబడు నిల్పుతో వయసుదార్కొను మవ్వపు గువ్వగొంతుతో
చిడిముడి పాటుతో కదలు చిన్నది నామది చెంగలించెడున్!

అంచిత రాగరేఖ వికచాబ్జ పథమ్ముల సాగి వచ్చురా
యంచ విధాన నమ్రపు టొయారములొల్కు సొబంగు కొక్కెక
వ్వించి మెకందలో చిలుకరించిన జవ్వని చాయడేలి భా
వించు కళాపథాల చివురించి సుమింపవొ కావ్యవల్లరుల్!

అలలికాంగి మావి చివురాకు మెఱుంగు తురాయి కొటలన్
గ్రాలు వసంతు శ్రీరథ రథాంగము లల్లన గాడికట్టిగా
కేల మదీయ శైశిర వికీర్ణ హృదంతర వాటికాంతరం
కాలకు లుల్లసిల్ల మణిహారముగా చివురింప వచ్చుటల్.

ఆ కలకంఠి కోమల కరాగ్ర రణన్నవకంకణ స్ఫురత్
శ్రీకమనీయ కాంతి తరళీకృత మాధు పికాంగ నారవ
ప్రాకట రాగవైభవ విరాజిత భాగ్యవినూత్న భాసురా
లోక నవప్రవాళ రుచులో మొదలో చివురుల్ రగిల్చెడున్

ఆ వరవర్ణినీ చలదపాంగ విలోల విలోకన ప్రభా
భావ పరీతరాగ పరిపాలిత మామక కావ్య మాలికల్
భావుక భావ్యమాన పరభాగ సముజ్వలకాంతి వీచికా
రావ విశేష శేష మధురాధర లాలిత రక్తిసేలు గో!

# కష్టజీవులు 

శ్రీ పీరుభొట్టు సూర్యనారాయణ

పర్వతముల జంటవలె నున్నవీ యెడ్లు
నడచుచుండి కూలిపడుచునుండె,
ఎండుటాకులోని యీనెలవలె లోని
యెముకలెల్ల జూచి యెంచవచ్చు.

సంచివోలెనుండె చర్మంబు, ముడుతలై
గాజుబిళ్లలట్లు గండ్లు మెఱయు,
చావలేదుగాని కన్యావశిష్టమై
యూర్చుచుండె! బాధకోర్చుచుండె!

మూపునైన కాదు మోకాలిపై కూడ
కాయ కాచియున్న కష్టజీవి,
ఎన్ని పుట్ల భూములివ్వి పండించెనో!
పట్టిపోయె నాటి బలసమృద్ధి!

బడియ చేరబూని, యెదనెక బాదుచు,
తోకనిఱిచి, యెక్లదోలుచుండె!
కలకు టెలుకవోలి కన్పట్టుచున్నాడు!
ఎచటి కివ్వి? వీని నేమి సేయు?

కొమ్ములుండికూడ గుమ్మగానోపవు
బుస్సుమనవు, యూర్పు వోసికొనుచు,
శాంతమేమి! వీనిసౌజన్యమేమిరా!
యిట్టిచిత్తవృత్తి యెట్టులబ్బె!

లాంగలములు గట్టి, లాగించిబండ్లను,
వీని కష్టఫలము వినువ యెపని–
క్రియమొనర్చు దుదకు రెండుపుంటలకు
పర్వతములవోలు వానియెడ్లు

బలము దఱిగియున్న పశువుల రక్షింప
శాసనంబులేవి? శాలలేవి?

ద్రవ్యమునకు నేడు దాసులైపోయిరి
రైతులౌర! ప్రేమ రహితులగుచు
పచ్చినీళ్లకొఱకు పాధింపగా లేదు
పెట్టుగాక నీవు గొట్టుగాక
కందరములు నీదు కలిమికై పెచ్చించి
అనువులొండెయున్న పశువు లివ్వి

అడవులెల్ల దోటలయ్యె, నాదోటలు
పంటభూములయ్యె, బయళులేవి?
తిరుగ జోటు లేదు తిన మేతయూ లేదు
పసరములకు నద్ది బ్రతుకు తెఱవు.

వేరుశనగ, చెఱకుపైరులు మెండయ్యె
ఆ పొగాకుతోట, లంతులేదు-
గింజపైరు కాదు కిట్టింపు—పశులకు
మేత లేదు-మనకు మెతుకు లేదు!

పశులమేతకనవు ప్రత్యేకముగ పెంచి
మేటివేయు కట్టుబాటు లేదు
వట్టిగడ్డి యెంత బలమైన మేతరా!
అదియునైన చాలినంత యేది?

పంజరములనుంచి పండ్లు గింజలు పెట్టి
పెంచుచుంటి వీవు పిట్టకదుపు
కష్టములకు నోర్చి కనిపెట్టుకొనియున్న
జీవులన్న నేల శీతకన్ను-

పొరపాటు–లనుచు బడిచచ్చుచున్నాడు
మానవుండు బుద్ధిమంతు డౌట!
కరుణ చూపలేడు, ఘన కార్యమా యేమి?
ఈ కనీసధర్మ మెఱుగవలదొ!

# అమరు కాంధ్రీకరణము



శ్రీ నిడుదవోలు వేంకటరావు

అమరుక మమరభాషయందలి శృంగారరసోత్తర గ్రంథము. శృంగారరసగుళిక యని శృంగార రసపేటికయని, శృంగార కంఠాభరణమని రసజ్ఞులు దీనిని గొనియాడెదరు. ఇది కావ్యవిద్యాస్నాతకులకు క్రముభూషణము. సంస్కృత హృదయులకు సంతతాహ్లాదకరము. దీనిని శతకమని సంప్రదాయజ్ఞులు, లఘుకావ్యమని సారస్వత విమర్శకులు—ఖండకావ్యమని నవీనభావుకులు వ్యవహరింతురు.

అమరుక మాదిశంకరులు రచియించిరని ఐతిహ్యము. అమరుకవి రచించియుండునని యాంతరంగిక ప్రమాణము. కవి యెవ్వరైన నమరుకమాకృతి కర్త కమరత్వము సిద్ధింపజేసినది. సుప్రసిద్ధ సంస్కృతాలంకారికులు, ఆనందవర్ధనుడు వామనుడు, నమరుకము నుదాహరించిరి. కవితాప్రపంచమున నొకప్పుడు కాళిదాసుకన్న ఘనయశస్సు గాంచిన మయూరుడు తన సూర్యశతకమున నమరు శ్లోకచ్ఛాయల ననుసరించెననుటచేత నమరుక కావ్యప్రఖ్యాతి విశదీకృతమగుచున్నది. దాక్షిణాత్య సంస్కృతకవి స్తుతికెక్కిన 'అమరుకవి' క్రీ. శ. 6వ శతాబ్దికి ముందువాడనుట నిస్సంశయము.

అమరుకమందలి శృంగారము వర్ణనాప్రధానము గాదు ధ్వనిప్రధానము. రచన యేకభావ మాత్రగ్రథితము గాక, బహు భావసమన్వితము. కేవలాలంకారికకవి సమయముల ననుసరించి, కావ్య సృష్టిసేయక, నాయికానాయిక రసభావసందర్భములను సన్నివేశములను రసోల్లసితమగురీతి జీవకళా భాసురములుగా నొనర్చి, యమరుకవి శృంగార రస పోషణము కావించినాడు.

1. *New Catalogus Catalogoram by Dr V. Raghavan. Published by the University of Madras 1951 Page 251 to 253.*

ఇందలి శృంగారము, మేఘసందేశ కావ్యాదుల యందలి శృంగారమువలె యేక భావగ్రథితము గాక, భాణములయందలి శృంగారమువలె, నసభ్యము గాక కుచశతకాదులయందలి శృంగారమువలె జుగుప్సాద రూపము వహింపక రసనిష్యందంబై రసికజనాంతః కరణ సంతతద్రవీకరణ కారణభూతమై వెలయుచున్నది.

సంస్కృత భాషావాఙ్మయమున నమరుక మెట్టిదో ప్రాకృతభాషావాఙ్మయమున హాలుని గాథాసప్తశతి యట్టిది. రెండును శృంగారరస ప్రాధాన్యములే. రెండును, కేవల శృంగారరసముచే కావ్యరచన సాధ్యమని దారిచూపినవియే. అయిన రస నిరూపణమున భిన్నపథకములైనవి. దానియందలి శృంగారము, ప్రాకృతముగావున యమాయికపు పల్లెటూరి పడుచువంటిది. రెండవది సంస్కృతము గావున నాగరకతయం దారితేరి, పలుపోకడ లెఱింగిన వెలజాణవంటిది. ఒకటి ముగ్ధశృంగారము వేఱొకటి ప్రౌఢశృంగారము నిరూపించినవి.

## సంస్కృత వ్యాఖ్యలు

సంస్కృతమున నమరుకవ్యాఖ్య లిరువది మనకు లభ్యములగుచున్నవి[1]

(1) రసికసంజీవని - అర్జునవర్మ
(2) అర్జునవర్మ - రసిక సంజీవని
(3) కవిచంద్రుడు
(4) కోకసంభవుడు
(5) గోకుపురీంద్రసూరి
(6) చంద్రకంకాలాధరుడు
(7) జీవశంకరుడు
(8) నందలాలుడు - భావబోధిని
(9) నందికేశ్వరుడు

(10) కామద — జ్ఞానానంద కళాధర రవిచంద్రుడు ఇది శృంగార వైరాగ్యపరముగా రచితమైనది

(11) చతుర్భుజమిశ్రుడు — భావచింతామణి

(12) శేషరామకృష్ణుడు

(13) రామరుద్రుడు

(14) రామానందనాథ పండితుడు

(15) విదగ్ధ చూడామణి

(16) విద్యాకరమిశ్ర

(17) వేమభూపాల శృంగారదీపిక

(18) వీరవల్లి శ్రీనివాసాచార్యులు

(19) సూర్యదాసు శృంగార తరంగిణి

(20) హరిప్రభట్టు

ఇవి కాక, తంజావూరి రఘునాథరాయల కాలమున (1614 1634) శృంగారసంజీవని యను సంస్కృతవ్యాఖ్య యున్నట్లును, నది రఘునాథరాయల కంకితము చేయబడినట్లును సైవస్థపరిణీయము (అముద్రితము)న నీ క్రింది విధముగ చెప్పియున్నది

"అమరుకాలంకార పారిధంగికల శృంగార
సంజీవనీ కామకుండు"

పై వానిలో విద్వన్మనోహర శ్రీనాథుని కాశ్రయదాత యగు పెదకోమటి వేమభూపాలుని వ్యాఖ్య శృంగారదీపిక మిగుల వ్యాప్తిలో నున్నది ఇది తెలుగు లిపిలో మాత్రమే ప్రకటితమైనది దేవనాగరి లిపిలో నింగ్లీషు భాషా వివరణముతో ప్రకటితమైన యీ వ్యాఖ్యానసారస్వతము రాష్ట్రేతర విద్వాంసులు గ్రహింపగలరు

## తెనుగు టీకలు

అమరుకమునకు తొలుత తెలుగు టీక తాత్పర్యము వ్రాసి ప్రకటించినవారు శ్రీ శే చదలువాడ సీతారామశాస్త్రిలవారు వారు దీనిని క్రీ శ 1865 సంవత్సరమున రచించి ప్రకటించిరి ఆ వెనుక చాల కాలమునకు శ్రీ శే వేదము వేంకటరాయశాస్త్రిగారు సంస్కృతాంధ్ర వ్యాఖ్యలతో ప్రకటించియున్నారు

## కానుకొలను అన్నమరాజు

ఆంధ్రవాఙ్మయమున మనకు లభ్యములైన యమరుకాంధ్రీకరణములలో కానుకొలను అన్నమరాజుదే మొదటి కృతియని, చెప్పవొప్పును ఇది పూర్తిగ లభింపలేదు కాని యిందుండి ప్రబంధ రత్నావళిలో నీక్రిందిపద్య ముదాహృతమై, యాంధ్రీకరణమున్నదని తెలుపుట కాధారమైనది

"చులుకన నాపయుండియుచు చో
గటకాముఖ పరివాద చె
ల్లాలయుగపాంసులం గదిసి
యుప్పుడు కెంజిగురాకు గుత్తిచే
నలవడి కర్ణపూరమున నంటిన
కుమ్మదనోని పార్వతీ
లలనకటాక్షదృష్టి మనలం
జరితార్థుల జేయు గావుతన్

(ఇది యమరుక ప్రారంభశ్లోకము "జ్యాకృష్టిబద్ధ కటకాముఖ పాణి పృష్ఠ ప్రేంఖన్నఖాంశుచయసంవలితో౽ంబికాయాః, త్వాం పాతు మంజరిత పల్లవ కర్ణపూర లోభ భ్రమత్ భ్రమరవిభ్రమభృత్కటాక్షః, అనుదాని తెలుగుసేత)

ఈయన్నమరాజు క్రీ శ 1494 లో నున్నట్లు క్రింది శాసనమువలన దెలియవచ్చుచున్నది

* ప్రబంధ రత్నావళి — బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సంపాదితము పుట 2 ఇందలి పద్యములు ప్రాచీనాంధ్రకృతులనుండి యిరువురు సంధానకర్తలు (1918) కూర్చిన సంకలన గ్రంథములందలివి ఒకటి పెదపాటి జగ్గన ప్రబంధ రత్నాకరము ఇది యముద్రితము—మాదాన్యాసములకు తంజావూరి పుస్తకాగారమున సంఖ్య (189) గా లభ్యమగుచున్నది రెండవది 'ఆంధ్రసాహిత్యపరిషత్తు' న సుదాహరణ గ్రంథమని పేర్కొనబడిన సంకలనము దీని కర్త పేరు తెలియలేదు ఇది యునముద్రితమే ఈ రెండింటియందలి యపూర్వములైన కృతులను పద్యములను సంగ్రహించి విలువగల పీఠికతో నలంకరించి, గ్రంథరూపమున వెలువరించిన శ్రీ ప్రభాకరశాస్త్రిపాదులకు నాంధ్రవిద్యాలోక మెంతయుం కృతజ్ఞత చూపవలసియున్నది దీనికి కొంత సంస్కారముచేసి పునర్ముద్రితము కావలసియున్నది

### 5 జయంతి రామయ్య (1861-1941)ం

గ్రాంథికవాదాగ్రేసరులు, రామయపంతులు గారు, అమరుకమును క్రీ శ 1902 ప్రాంతముల నాంధ్రీకరించి, అప్పటి రాజకీయోద్యోగ నిర్బంధముచే ముద్రింపక, క్రీ శ 1932 లో పలువురు విద్వత్ప్రభువులు ప్రోత్సహింప ముద్రించిరి ఇది మూలముతోగూడ, సరసమైన యాంధ్రీకరణముతో ముద్రితమైనది

### 6. వట్టిపల్లి నరకంఠీరవశాస్త్రి

ఈతడు తిరుపతి సంస్కృత కళాశాలయందు సాహిత్యాచార్యుడు ఇటీవల కీర్తిశేషుడు ఈతని యమరుకమున పద్యములు భారతిలో ప్రకటితములైనవి

### 7. చెఱుకూరి కాళహస్తీశ్వర శర్మ

సులభశైలితో రచితమైన యీ యమరు కాంధ్రీకరణము 1931 లో 'సమదర్శిని' సంవత్సరాది సంచికలో ప్రకటితమైనది.

### 8. మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రి

విశాఖమండలమున పాలకొండ వాస్తవ్యులగు మంగిపూడి శ్రీరామచంద్రశాస్త్రియను కవి దీనిని చక్కగ భాషాంతరీకరించియున్నాడు ఇది ముద్రితమయ్యు ప్రకటితము కాలేదు

### 9 గుఱ్ఱము సుబ్రహ్మణ్యము ఎమ్. ఏ. బి యల్

వీరి యమరుకాంధ్రీకరణము క్రీ శ 1938 లో ప్రకటితమైనది. శ్రీయుత కొటూరి వేంకటేశ్వరరావుగారి టీకతోగూడ వెలయుచున్నది తెనిగింపు సమీచీనముగ నున్నది.

### 10 వింజమూరి శివరామారాయకవి

### 11. పెనుమర్తి వేంకటేశ్వరశాస్త్రి

### 12. ఘట్టిలక్ష్మీనరసింహశాస్త్రి

వీరు ముగ్గురు నీ తరువాత నమరుకము నాంధ్రీకరించిరి ఈ యాంధ్రీకరణము పైవిమర్శకాభిప్రాయమిది 1 శివరామంగారి రచన ద్రాక్షాపాకము

2 పెనుమర్తివారి రచన కదళీపాకము.

3. ఘట్టివారి రచన నారికేళపాకము.

(భారతి 30 సం 7 సం 98 పుట 1948 జూలై) ఘట్టివారు నేడు తమ రచనమును పునర్ముద్రణము చేసి యున్నారు అది భారతిలో విమర్శింపబడినది

వీరుగాక శ్రీ వండూరి శివరావుగారును, కీ శే. మారేపల్లి రామచంద్రశాస్త్రిగారును దీనిని తెనిగించిరట ఇంకను నా గమనమునకందని యనువాదములుండ వచ్చును నాకు దెలిసిన దేర్చదను

సంస్కృత గ్రంథానువాదముల చరిత్ర తెలుసుకొనుటకేమి, ఏక కర్తృత్వము గ్రహించిన కవులను గూర్చి సమగ్రముగను, సప్రమాణముగను పరిశ్రమ చేయుటకేమి, అయా గ్రంథసూచికలు ముద్రితా ముద్రిత వివరణముతో గూడ నే దత్యంతావశ్యకమై యున్నది అట్టి యాంధ్ర గ్రంథ సూచికా సర్వస్వ రచనను ప్రోత్సహించుట కీ వ్యాసముద్దేశింపబడినది



# వియోగాగ్ని

★

'మధుశ్రీ'

ఊహాకలితమైనది, మహోన్నతమైనది, దివ్యశక్తి నం
దోహములోడఁ గూడినది, దుఃఖము లేనిది, భీతిగాని, నం
దేహముగాని చేరనిది, తృప్తికరమ్మయి సర్వలోక స
మ్మోహనమైన యట్టిదియుపో! ప్రణయ — మ్మది యెంత గొప్పదో!

చెలి! నీనా ప్రణయామృతాంబునిధి వీచీమాలికా డోలికా
వళి నిన్నున్ మఱి నన్ను నేదొయొక స్వప్నభ్రాంతిగా మేఘ వీ
థులపై దేవవధూ రహస్సులయందున్, త్రిప్పె, నానాఁటి వే
ళల యందెప్డొయొకప్డు — స్వర్ణసుమముల్ ప్రాలెన్ శిరోగ్రమ్ములన్.

అంతియ! దానితోసరి! మహావిష దంష్ట్రిలఁ బోలు తత్స్మృతుల్
స్వాంతమునందునన్ నిలిచి శాశ్వతదైన్య విషాద వహ్ని సం
క్రాంతిగఁ జేయుచున్నవి — సుఖమ్మటువంటిదొ యేనెఱుంగఁ గ
ర్ణాంత విలోచనా! కనికరమ్మును జూపెడివారు లేరుపో!

నీవొక దేవకన్యకవు! నేనొక రాక్షసమూర్తినేమొ? దే
వీ! వరమిచ్చి మెచ్చితివి, విభ్రమచిత్తుడనై ప్రమోదరే
ఖావధి దాఁటలోపలన కన్నులు విప్పితిఁగాని నిన్ను నా
ప్రావృత దృష్టియుక్త నయనాంచలసీమలయందుఁ గంటినా?

ఒకఁడవనో మహోజ్జ్వల మహోన్నత సత్కవిరాజు వానినా
టకమున సృష్టిచేసిన రటన్నటివాడవు నీవు, కాని — మా
యకు వశమైన లోకములయందెటనైనను నిన్నుఁబోలు నా
యకి జనియించెనా? హృదయమందలి భ్రాంతులు నాశ్వఁ గ్రాంతులై!

ఇది వియోగాగ్ని! — దీని నీవే యొసంగి
నావు — నీ బహూకృతి శిరసా వహింతుఁ;
గాని, వన్నెల విసనకఱ్ఱ 'నసున్' ము
ఱెంతకాల మహర్నిశ లేద్యు మనదు?

# కలగూరగంప

## శృంగార రసమంజరి

వికృతి భాద్రపద శుద్ధములో ఆంధ్రగానకళా పరిషత్తు (రాజమహేంద్రవరము) వారిచే ప్రచురింపబడిన క్షేత్రయ్య పదములను గ్రంథములో అనుబంధముగా 'శృంగార రసమంజరి' ప్రకటింపబడినది నా సంపాదకత్వమున వ్రాయబడిన "తొలిపలుకులో" (పుటలు 52 - 58) 'క్షేత్రయ్య పదములు - అలంకార శాస్త్రము' అను శీర్షిక క్రింద నాటికి నాకు లభ్యమైన విషయము ననుసరించి ఇట్లు వ్రాసితిని "ఈ వివరణకు 'శృంగార రసమంజరి' యని పేరు దీని కర్త యెవరో తెలియదు ఆంధ్రసారస్వతములో క్షేత్రయ్యపదముల స్థానమును, విలువను నిర్ణయించుచు ఈ గ్రంథకర్త చేసిన సేవ చిరస్మరణీయము" ఈ వివరణయంతకు కర్త యొక్కరే యను యుద్దేశముతో అట్లు వ్రాసితిని కాని సుమారు నాలు రోజుల క్రిందట ఈ వివరణయొక్క కర్త లిద్దరని స్పష్టమైనది ఈ విషయమును క్లుప్తపరచుచున్నాను

కొలదినముల క్రిందట విజయనగరము వెళ్ళి యుంటిని అచ్చటి మహారాజావారి సంగీత కళాశాలలోని శ్రీ దువ్వూరి జగన్నాథశర్మగారిని—నాట్యాచార్యులను— కలిసితిని ప్రసంగసందర్భములో వారు, శృంగార రసమంజరీ కర్త, గుడిపాటి కోదండపతి యని, వారి గ్రంథము 1901 లో అచ్చైన దని, అది వారివద్ద కలదని చెప్పి నాకది దయతో ఇచ్చిరి ఈ విషయము శ్రీ వీరేశలింగము పంతులు గారు వారి ఆంధ్రకవుల చరిత్రలో మూడవ భాగములో వ్రాసియున్నారనికూడ వారు తెలిచ్చిరి ఈ విషయము వారు నాకు తెలియజెప్పినందుల కెంతయు కృతజ్ఞుడను.

అందుపైని రాజమహేంద్రవరములోని శ్రీ గౌతమీ గ్రంథాలయమునకు జని అచ్చట యా విషయమై కనుగొనగా, 1901 లో అచ్చైన శృంగార రసమంజరియే గాక, 1872 లో అచ్చైన 'సంస్కృతాంధ్ర రసమంజరి'కూడ లభ్యమైనది. ఇది వింజమూరి కృష్ణమాచార్యులవారి చేతను సీతారామాచార్యులవారిచేతను పరిష్కరింపబడి, వింజమూరి కృష్ణమాచార్యులవారిచే రచింపబడిన మకరంద మనుపేరి వ్యాఖ్యానముతోడ, ఊ. పుష్పరథ సెట్టిగారిచే చెన్నపురిలోని స్వకీయ కళారత్నాకర ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రకటింపబడియెను ఇందు భానుదత్త కవికృత సంస్కృత రసమంజరి మూలములోని ఒక్కొక్క శ్లోకమునకు ప్రతిపదార్థము వ్యాఖ్యానము (మకరందనామవ్యాఖ్యానము) తరువాత గుడిపాటి కోదండపతికవిచే ఆంధ్రీకరింపబడిన వచనము, పద్యము వరుసగా ఇయ్యబడినవి ఇందలి ఆంధ్రభాగము మాత్రమే 1901 లో అచ్చువేసిరి దాని వివరణ మిట్లు "గుడిపాటి కోదండపతి కవివరప్రణీతంబైన శృంగారరసమంజరి— ఇయ్యది పండితులచే పరిష్కరింపబడి వంకాయల కృష్ణస్వామిశెట్టివారి స్వకీయ శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రించి ప్రచురింపబడియె చెన్నపట్టణం—1901 సం॥ ఆ ౨" ఈ తెలుగు రసమంజరికిని పైన చెప్పిన 1872 లో ముద్రితమైన దానిలోని తెలుగు అనువాదమునకును అచ్చటచ్చట కొద్దిపాటి భేదములు కలవు కాని సముదాయముమీద ఒకటే గ్రంథము. 1872 లో అచ్చైనదే శుద్ధముగా యున్నదని చెప్పవలసియున్నది ఇదివరలో నాకు లభ్యమైన భానుదత్తుని సంస్కృత రసమంజరి, నాగరలిపిలో ముద్రితమైనది. అందు అనంతభట్టుచే రచింపబడిన వ్యంగ్యార్థ కౌముదియను వ్యాఖ్యానము కలదు. తెలుగులిపిలో ముద్రించిన ఈ సంస్కృతాంధ్ర రసమంజరిలో అనంతభట్టు వ్యాఖ్యానములేదు.

గుడిపాటి కోదండపతి నందవరీకనియోగి బ్రాహ్మణుడు. ఆశ్వలాయన సూత్రుడు, కౌండిన్యస

గోత్రుడు, సురతాణి బిరుదాంకితుడగు వెంగళమంత్రి పౌత్రుడు, రంగయామాత్యునకు వీరమాంబకును పుత్రుడు ఇతడు మూడుగుచ్ఛములుగా వెలిగించిన శృంగార రసమంజరిలోని తృతీయగుచ్ఛము చివరను గల గద్య ఇట్లున్నది

"ఇది శ్రీమత్కోదండరామ వరప్రసాదలబ్ధ చతుర్విధ కవితాధురీణ భారద్వాజగోత్ర పవిత్ర, వెంగళమంత్రిపౌత్ర, రంగయామాత్య పుత్ర, సత్కవిజనమిత్ర, సకలకళాలవిత్ర, గుడిపాటి వంశ పయః పారావార రాకాసుధాకర, సురతాణికోదండ పతి ప్రణీతంబైన శృంగారరసమంజరియందు, చత్వారింశ త్పద్యదళంబులుం చతుర్దశ వచనకేసరంబులుం గల కుసుమపంచకంబుచే నొప్పారు తృతీయగుచ్ఛము"

మరియు నీ గ్రంథాంతమున నివ్వబడిన రెండు పద్యముల నుదహరించుచున్నాను

"శ్రీరంగనాయకి నవ
నీరజమృదుపాదములను నే బూజింతున్
శ్రీరంజిలు రసమంజరి
మూరిస్తుతి పారిజాత సుమమంజరిగన్"

"శ్రీకరనందవరీ కాగ్రగణ్యుండు మహిమీఱు
గుడిపాటి వంశభవుడు
బిరుదుగా నరభూప సురతాణి పేరంది
మహితుడౌ వెంగళమంత్రి పౌత్రు
డతులితుడౌ రంగయామాత్య తనయుండు
వీరమాంబానంద వృద్ధికరుడు
సింగన్న వెంగళ శ్రీనిధులనుజాతై
భాసిల్లు కోదండపతి ఘనుండు
సరస కవితా చమత్కార సార్వభౌము
డనఘ శ్రీరంగధాము దయాశ్రయుండు
వెలయ రసమంజరిని రచియించెనందు
సరవిగా తృతీయగుచ్ఛంబు దనరు.

ఇతడు 'శ్రీరంగనాథ దయాశ్రయుండ' నని 'శ్రీరంగేశ్వరి రంగనాయకిని సేవింతు నెల్లప్పు' డని కృత్యాదియందు శ్రీరంగనాథుని శ్రీరంగనాయకిని స్తుతించుచు పద్యములు వ్రాయుటచేతను శ్రీరంగ ప్రాంతములయం దితడుండెనేమో యని చెప్పవచ్చును. కృత్యాది పద్యములలో నివి కొన్ని.

"శ్రీరంగనాయకో నుత
సారంగమదార్ద్రి పత్రజయశోభన, శే
ఖారుచిరభుజాంతరయగు
శ్రీరంగేశ్వరు డభీష్టసిద్ధు లొసంగున్"

"నందవరవంశ జలధిపూర్ణేందులీల
రసికజనుపట్టి సురతాణిరంగ ఘనుని
సుతుడు కోదండపతికృతి ప్రమతియొనర్చు
మంజురసపుంజ శృంగారమంజరిగను"
"మధుర మార్ద్వీకఫణితి గా మధువితీర్ణ
వాసనావాక్య సౌరభ్యవాసరసిక
మధుకరానందకర రసమంజరియును

దనరు కవిరాజకర్ణావతంస మగుచు"

ఇతడే కాలమువాడో తెలియదు "ఇన్నూఱు సంవత్సరముల క్రిందట నుండియుండు నేమో" యని శ్రీ వీరేశలింగము పంతులుగా రభిప్రాయపడియున్నారు

క్షేత్రయ్య పదములతో అచ్చువేసిన శృంగార రసమంజరికిని దీనికిని కొన్ని ముఖ్యములగు భేదములు కలవు క్షేత్రయ్య పదములతో అచ్చువేసిన దానిలో రెండు భాగము లున్నవి పుటలు 219 – 287 లలోని వచనములో నియ్యబడిన నాయికాది లక్షణమంతయు కోదండపతి శృంగార రసమంజరిలోని వచనభాగమే. తరువాత 288 – 258 పుటలలోని "(క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములు – సమన్వయము)" అను శీర్షిక క్రింద అచ్చైనదంతయు చాలవరకు కోదండపతి కృతిలోనిదే యని చెప్పవలెను మొదటి రెండు పుటలలోని మూడు పద్యము లా కవి వ్రాసినవే భానుదత్తుని రసమంజరిలో లక్షణము - వచనము, శ్లోకములతోను లక్ష్యము శ్లోకరూపమునను ఇవ్వబడినవి కోదండపతి, శృంగార రసమంజరియందు లక్షణమును వచనమున తెలుగులో వ్రాసి, లక్ష్యములను పద్యములలో వ్రాసెను క్షేత్రయ్య పదములతో ముద్రితమైన శృంగార రసమంజరిని రెండు భాగములుగా నెవరో క్రము తీసికొని, వ్రాసిరి. నాయికాది లక్షణములకు లక్ష్యములుగా వ్రాయబడిన పద్యములను వదలి ఎక్కువగా క్షేత్రయ్య పదములనుండి లక్ష్యములను చూపియున్నారు. సురతాణి కోదండపతి క్షేత్రయ్య పదములనుగురించి ఏమియును వ్రాయలేదు. అందుచేత

ఈ విధముగా శృంగార రసమంజరిని విడదీసి వచన భాగమును—(లక్షణముల నిచ్చిన భాగమును)— మాత్రము మొదట వ్రాసి లక్ష్యముల క్రింద సుప్రసిద్ధ పదకర్తల పదములను చేర్చి రెండవ భాగముగా విడదీసిన వారెవరో ఇంకను స్పష్టపడలేదు

మరియు రెండవ భాగమున నీ యజ్ఞాత సంపాదకుడు, లక్షణములను దెలుపు కోదండపతికృత వచనము వ్రాసి, తరువాత "ఇందు కుదాహరణము 'నన్నేటికి బొమ్మ నేరిచే వానివద్దకి ౧" అనునట్టి స్వంత రచనలను చేర్చినాడు ఈ వచన భాగమంతయు శృంగార రసమంజరి కర్త వ్రాసినదే దీనినే క్లుప్తపరచి మొదటి భాగముగా (219—87 పేజీలలో అచ్చువేసినది) ఈ సంపాదకుడు వేరె వ్రాసియున్నాడు అందుచేత నీ వాక్యములలో కొంత భేదమున్నది (పట్టికలు ప్రక్క పుటలో)

ఈ మూడు పట్టికలను, శృంగారరసమంజరీ భాగమున క్షేత్రయ్య పదములతో, గ్రంథ విస్తర భీతిచే ముద్రించలేదు విషయమంతయు లక్ష్య వివరణముం దిక్కుబడినదే గదా యని ఈ విభాగములు గల పట్టికలను అచ్చువేయుట మానుటయైనది కాని ఇప్పుడు ఈ శృంగార రసమంజరి కర్త యెవరను నిరూపణ విషయము వ్రాయుచుంటిని గాన కర్తలిద్దరు కలరని, మొదటివారు కోదండపతికవి యని, రెండవవారు మువ్వ గోపాల పదములను, ఇతర పదములను శోధించి వాటికి లక్షణములను నిర్ణయించి వివిధరీతుల విషయవిభాగ మొనర్చినవా రని చెప్పవలసి వచ్చినది గాన, ఈ యజ్ఞాత పురుషునిగురించి వివరముగా వ్రాయుటకై ఈ పట్టికలను కొంత ఉదహరించియున్నాను

ఈతడు కోదండపతికవికంటె బాగా తరువాతి ఆధునికుడైయుండును ఏమనగా, మొదటి పట్టికలోని అచ్చు గ్రంథములలోని రెండవదానిలో గల అంకె లనుబట్టి పదములను సరిచూడగా క్షేత్రయ్య పదములకు వ్రాసిన తొలిపలుకులోని 85 పుటలో ఉదహరించిన 1862 లో ముద్రితమైన గ్రంథములోని పద సంఖ్యగా కనిపించుచున్నది. అందుచేత ఈతడు 1860 ప్రాంతమునకు తరువాతనే వ్రాసియున్నట్లు చెప్పవలెనేమో. 1862 నకు పూర్వమచ్చైన గ్రంథమేదైన యొకటియుండి అందును ఇదేరీతి పదసంఖ్య యుండినచో 1862 కు పూర్వుడని చెప్పవచ్చును ఈతని పేరు, ఊరు, కాలము ఇప్పటికి నాకు తెలిసినంతవరకు నిర్ధారణ కాలేదు.

వికృతి మాఘమాస 'భారతి'లో 162 పుటలో శ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు సభాపతియ్య పదములగురించి వ్రాసిన వ్యాసములో ఇట్లు ఫుట్ నోటులో వ్రాసియున్నారు " క్షేత్రయ్య పదములతో చేర్చి ముద్రించిన 'శృంగారరసమంజరి'ని రచించినదియు, క్షేత్రయ పదములలో కొన్నిటికి నాయికా, నాయక రసభావాది నిర్ణయము గావించినదియు, నీ పదములకు (సభాపతయ్య పదములకు) వివరణాదికములు వ్రాసి ప్రకటించిన శ్రీ నీ మా. తిరువెంకటాచార్యులవారే యని తలపదగియున్నది. వేఱువిధమయిన ప్రామాణికాధారము లభించునంతవరకు నీ యూహ సరియయినదే యనుటకు బయి ప్రకటనములోని వాక్యములయొక్క సాక్ష్యము చాలు ననుకొందును"

పైన నేను వివరించినదానిబట్టి 'శృంగార రసమంజరి' కర్త గుడిపాటి కోదండపతి యని సప్రమాణముగా చెప్పవలసియున్నది రెండవవారెవరను విషయములో విషయసామ్యమునుబట్టి శ్రీ తిరువెంకటాచార్యులవారయిన కావచ్చును కాని, సభాపతయ్యగారి పదములను 1884 మార్చి నెలలో చెన్నపట్టణములోని శ్రీవాణీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రించబడినది అందీ పదములకు '(శ్రీ) తిరువెంకటాచార్యులవారు సంగ్రహించిన యాంధ్ర వాక్యరూపమయిన నాయికా నాయకాది లక్షణములను, రసమంజరి యుదాహరణ శ్లోకములను నొసగబడియున్నవి' పరిష్కర్తలచే 'గ్రంథమునకు దొలుత గావించబడిన ప్రకటనము'లో ఇట్లున్నదని తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారి వ్యాసములో గలదు.

*. . భావజ్ఞేతరులకు సయుక్తము విశదపడునట్లు ముందు ఉపోద్ఘాతమును, అవతల రాగము, తాళము, పదము, నాయికి, నాయకుడు, రసము, సంచారిభావము, అలంకారమును, ఒకటి వెంబడి నొకటి క్రమముగాను — కడపట రసమంజరీ శ్లోకోదాహరణములను చేర్చి—అతిప్రయాసముకు వెనుదీయక

పట్టికలు *

*I* మరియు, నీ సంపాదకుడు, ఇంక కొంతో క్రమదీపికవి లక్షణములకు లక్ష్యములుగా తా నిచ్చిన పదములను అకారాదిగా ఒక పట్టీలో నిచ్చినాడు. అందులోని క్షేత్రయ్యపదములకు తాను సంపాదించిన రెండు అచ్చుప్రతులలోను, రెండు వ్రాత ప్రతులలోను నివ్వబడిన పదసంఖ్య నిచ్చి నాయికా భేదములను కూడ ఇచ్చియున్నాడు ఉదాహరణముకై కొన్ని పంక్తులను వ్రాయుచున్నాను.

*II* ఈ విషయమునే మరియొక రీతిని విభాగించి పట్టీకగా వ్రాసియున్నాడు. లక్షణములలో చేర్పొన్న కరుసలోగల వివిధనాయికాదులను వరుసగా చెలువుచు లక్షణమునకు ఎదురుగా లక్ష్యముయొక్క ప్రారంభము నిచ్చినాడు

*III* మరియు ఈ విషయమునే ఇంకొకరీతిని పట్టీకగా ఇచ్చియున్నాడు

| (1) లక్ష్యము | అచ్చు | | వ్రాత | | లక్షణము |
|---|---|---|---|---|---|
| అందగాడనొదు చెర ఆదివరాహ | ౧౪ | ౧ | ౪౮ | ౧౫౫ | సామాన్య, ఖండిత |
| అనుకో ప నేమున్నది-యక్కర | ౮ | ౧౧ | ౨౫ | ౬౩ | స్వీ ప్రౌఢ దివ్య |
| పరదేశమున జేసిన పనులిందు | ౧౨౬ | ౧౫౩ | ౩౧ | ౮౦ | స్వీ ప్రౌఢ ప్రేమగర్విత |
| మంచిదాననే చెలియ మాటలకు | | | ౬౧ | ౨౨౦ | ప పరోఢ ఉపపతి శకుని పరిహాసం |

| (2) లక్ష్యము | నాయికా భేదము |
|---|---|
| నన్నేటికి బొమ్మనేరే, వాని వద్దికి | స్వీయ, ముగ్ధలో, నవోఢ |
| ఈమేను జీవునకు యింత ప్రియమాయెన్ | స్వీయ, ప్రౌఢ-విప్రలబ్ధ |
| అలుకదీరెనా నేడైన మా | స్వీయ, సఖిప్రౌఢ-పరిహాస లక్షణము |
| ఇటువంటివాడని నే దెలియ | ప, పరోఢ-గురుమాన |
| దినము లిటువలె వచ్చె | సా ; మధ్యమ |
| ఇంత దయగలవాని | సా, దూతీసంఘటన |

మువ్వగోపాలపద నాయికా పట్టీ

| (3) | స్వీయ | పరకీయ | సామాన్య |
|---|---|---|---|
| ప్రౌఢ-తృప్త<br>ప్రౌఢ-అతృప్త | నేటిదే కలయికరా<br>నన్ను నీవు దలచేది న్యాయమా | ఇప్పటికిలాగున మన్నా<br>ముద్దుపెట్టకేవుగా | మనకు విన్నెడబాయ<br>ఒకసారికే ఈలాగైతే |
| సౌందర్య గర్విత | తొయ్యలి వానిభువెవ్వ | తెలియనైతి నమ్మ | గడియ గడియకు |
| ముగ్ధ-స్వాధీనపతిక | ఇన్నాళ్లు మల్లాడిన దిందు | అక్కరోసిర్వనివారు | సామికి సరియౌవ్వరే |
| ముగ్ధ-విప్రలబ్ధ | కొంచెకత్తెలా మీరు | ఎక్కడిపేస్తము లెక్కడి పెనరు | ఒక్కటైన కాని నాయకునకు |
| పక్షి-ఉపాలంభన | మగవాని కట్టబెట్ట మనవికమా | చెలకా అతడు అలిగెడి | ఏలవచ్చితివే సామిపడకాకి |
| ... ... | . . | . .. | . ... |

వ్రాసి అచ్చు వేయించి ప్రచురించితిమి ఇందు వ్రాయబడియుండు లక్షణములు భరత రసప్రకరణము లోని శ్లోకములకు తెనుగు తాత్పర్యము గాని వేరు కాదు అలంకార లక్షణములును తెలుపునపుడు చంద్రాలోకములోని శ్లోకములను తెలుగు మాటలుగా మార్చి వ్రాసియున్నాము ఈ లక్షణములకు సంస్కృతమునందు చూడవలెనన్న భరత రసప్రకరణమును చంద్రాలోకమును చూడవలయును క్షేత్రయ్యగారి పదములు మొదలయినవానిలో లక్షణోక్తములైన కొన్ని పదములను సంగ్రహించి యిందలి లక్షణములతోడ చేర్చి ముద్రింప యత్నించియున్నాము"

దీనినిబట్టి 1884 నాటికి ముద్రింప యత్నించి యున్నట్లు తెలియుచున్నది అప్పటికే దీనిని వ్రాసి యుండవచ్చును పైన నేను సూచించిన రీతిని ఈ యజ్ఞాత రచయిత 1860 ప్రాంతములయందే రచియించి యుండును నేమో యని ఊహింపవలసియున్నది మరియు రెండు అచ్చుపుస్తకములలోను ఒకదానిలో 160 రెండవదానిలో 200 పదము లుండెనని పట్టికను బట్టి చెప్పవలసియున్నది 1862 లో అచ్చువేసిన గ్రంథమందు 228 పదములుండెను మొదట 200 లే దొరికినవని, విచారించగా ఇంకను 28 లభ్యమైనవని అందు ప్రకటింపబడియున్నది అందుచేత 200 గల ఒక పుస్తక మంతకంటె పూర్వమున యుండియుండె నేమో యని తోచుచున్నది అందుచేత 1884 నకు అధమ మిరువదేండ్ల క్రిందట, ఈ యజ్ఞాత పురుషుడు, ఈ పట్టీల వ్యాఖ్యారాలను వ్రాసియుంప వచ్చునేమో యని తోచుచున్నది మరియు అతను వ్రాసిన వ్రాత ప్రతిలో నాటి కచ్చులో లేని క్షేత్రయ్య పదములను సుమారు 90 పైని వ్రాసియున్నాడు

మరియు, సభాపతయ్యగారి పదములకు వ్రాసిన వివరణాదికముల గురించి శ్రీ తిరువెంకటాచార్యుల వారు వ్రాసినది పై నుదహరింపబడినది. అందలి లక్షణములు, భరత రసప్రకరణము, చంద్రాలోకములోని సంస్కృతలక్షణశ్లోకములకు తెనుగని చెప్పబడి యున్నది ఈ యజ్ఞాత సంపాదకు డుపయోగించిన లక్షణములు గుడిపాటి కోదండపతి రసమంజరికి వ్రాసిన తెలుగు వచనరచన కాని, భరతరసప్రకరణ, చంద్రాలోకములలోని సంస్కృత విషయమునకు శ్రీ తిరువెంకటాచార్యులవారు వ్రాసిన వచనరచన కాదు ఈ ఆచార్యులవారే యీ యజ్ఞాత పురుషు డైనచో ఈ సభాపతయ్య పదములలో వ్రాసిన తెనుగు లక్షణములనే యిచ్చియుండును ఏమన గా వారి ప్రకటనమందు చివర ఇట్లు వ్రాయబడినది "క్షేత్రయ్యగారి పదములు మొదలయినవానిలో లక్షణోక్తము లయిన కొన్ని పదములను సంగ్రహించి యిందలి లక్షణములతోడ చేర్చి ముద్రింపయత్నించి యున్నాము" ఈ లక్షణము వేరు గనుక, శృంగార రసమంజరిలోనివి, గుడిపాటి కోదండపతిచే వ్రాయ బడినవి గనుక, వాటిని అజ్ఞాత సంపాదకు డుపయోగించియున్నాడు గనుక, ఆచార్యులవారీ యజ్ఞాత పురుషులు కారని తోచుచున్నది

మరియు సభాపతయ్య పదముల వివరణ ప్రణాళికకు 'శృంగార రసమంజరి' రెండవభాగమందలి వివరణ ప్రణాళికకు భేదము కనపడుచున్నది, ముఖ్యముగా, సభాపతయ్య పదముల వివరణలో "కడపట రసమంజరీ శ్లోకోదాహరణములను జేర్చి" యని యున్నది ఇవి సంస్కృతమున మాత్ర మిచ్చిరో, తెలుగులో శృంగార రసమంజరి కర్త యగు కోదండపతి ఆంధ్రీకరణముకూడ నిచ్చిరో తెలియదు (గ్రంథము లభింపక చూడలేదు) ఎట్లైనను అజ్ఞాత పురుషుడు శ్రీ తిరువేంకటాచార్యులవా రగుటకు ఇవి బాధకరములనియే నా యూహ అందుచే యీ విషయ మింకను ఇదమిత్థమని చెప్ప వీలులేకున్నది.

శ్రీ విస్సా అప్పారావు.




బాదకుండగనే బట్టలను తెలగాను ప్రకాశవంతముగాను ఉతుకును

---

S 88 0 TL

## [illegible] మృత లేహ్యం

ఇది రక్తవృద్ధిని చేయు విలువ గల వస్తువులచే తయారు చేయబడినది మేహములు, నిస్త్రాణ నిస్సత్తువ, శుక్లనష్టము, అతిమూత్రము మొదలగు వాటిని ఖండించి, మంచి బలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమయినది అనేక సర్టిఫికెట్లు గలవు 2 డబ్బీలు చాలును

20 తులముల డబ్బీ రు. 2/-

పోస్టేజి ప్రత్యేకము

**పి. సి. ఏ. అండ్ కంపెని**

ఆయుర్వేద సమాజం

పెరిదేపి, (నెల్లూరు జిల్లా)

---

లోకప్రసిద్ధిపొందిన

## పి. వి. రాజన్ అండ్ కంపెనివారి




శ్రేష్ఠమైన మదరాసు నశ్యం

**R. S. సుగంధ ముక్కుపొడి**

అన్నిటిలో సాటిలేనిది

ధర వివరములకు వ్రాయుడు

తయారుచేయువారు —

**పి. వి. రాజన్ & కంపెని,**

ఆర్కోణం, Arkonam, N A Dt.

---




---

## కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహ మచ్చలు, సెగ. సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స, క్యాటలాగు ఉచితము.

---

**జి. ఏ. రెడ్డి అండ్ కో**

(రిజిష్టర్డ్)

"భాస్కరాశ్రమము"

గోపాలపురం, తూ. గో. జిల్లా

# గ్రంథవిమర్శనము

## గాంధి—మార్క్స

శ్రీ కిశోరీలాల్ మశ్రువాలా—అనువాదకులు వేమూరి ఆంజనేయశర్మ, ప్రకాశకులు సర్వోదయ సాహిత్య ప్రకాశన సమితి హైదరాబాదు దక్కను వెల రూపాయిన్నర

ఈ రోజుల్లో కమ్యూనిజాన్ని గురించి విరివిగా చర్చలు సాగుతున్నాయి అల్లాగే గాంధీతత్వాన్ని గురించి వేర్వేరుగా చర్చించిన పుస్తకాలనేకం ఉన్నాయి ఈ రెంటినీ గురించి సమగ్రపరిశీలనచేసి తారతమ్యం చూపించిన గ్రంథాలు తెలుగులో లేవు లేవని చెప్పవచ్చును ఇందుచేత ఈపుస్తకం తెలుగు పాఠకుల కెంతైనా ఉపయోగపడగలదు

కిశోరిలాల్ మశ్రువాలా ఈ పుస్తకంలో గాంధీవాదాన్ని గురించి, కమ్యూనిజాన్ని గురించి తారతమ్యపరీక్ష చేసి ఈ రెండింటినీ గురించి సమగ్రంగా చర్చించారు

గాంధీవాదానికీ, కమ్యూనిజానికీ లక్ష్యాలు ఒకటే కావచ్చును కాని ఆచరణలో రెండిటికీ ఉత్తరదక్షిణ ధ్రువాలకున్నంత తేడా ఉంది గాంధీ ఆధ్యాత్మికవాది అందుచేత ఆయన దృక్పథంలో ఈశ్వరవిశ్వాసము, అహింస మొదలయినవాటికి ప్రాధాన్యం ఏర్పడుతుంది

మార్క్సు గతితార్కిక భౌతికవాది కావడం వల్ల ఇతని వాదంలో పై విషయాలగోలే కనబడదు కాని, ధనస్వామ్యసమాజం తనలో సహజంగా అంతర్గతములై ఉన్న విరుద్ధశక్తులద్వారా, వర్గకలహం ద్వారా వర్గరహిత వ్యవస్థవైపు ములుమాపుతున్నదనీ, ఉగ్రమైన అవగాహనద్వారా వర్గరహిత సమాజంస్థాపనకోసం ప్రయత్నించడమే విప్లవపంథా అవుతుందనీ మార్క్సు అభిప్రాయము ఇతని అభిప్రాయంప్రకారం ఈవిధమైన సమాజస్థాపనకు సాయపడని కార్యక్రమం అంతా విప్లవ వ్యతిరేక పంథాయే అవుతుంది

గాంధీమార్క్సుల ఇద్దరి దృక్పథాలలోను ఒక ప్రధానమైన విభేదం కనబడుతుంది సాధన గతమైన గుణదోషాలు సాధ్యంలోకూడా సంక్రమించి తీరతాయని గాంధీ సిద్ధాంతము, అందుచేత ఒక లక్ష్యసిద్ధికోసం అవలంబించే సాధనం కూడా పునీతంగానే ఉండాలని గాంధీజీ అంటాడు మార్క్సు దృక్పథంలో ఒక లక్ష్యం సమాజశ్రేయస్కరమైనప్పుడు దానికోసం అవలంబించే కార్యాచరణ ఎల్లాంటిదైనా దానివిషయంలో ఆక్షేపణ ఏమీ ఉండదు

మార్క్సు దృక్పథం జీవితానికంతటికీ సంబంధించినది గాంధీజీ సిద్ధాంతం ఒక్క రాజకీయ స్వాతంత్ర్యసంపాదనకోసమే ఉపయోగపడిందని అనుకోకూడదు ఇదికూడా జీవితంలోని ప్రతిసమస్యకు ఒకనిర్దిష్టమైన దృక్పథంఏర్పరుస్తుంది. అయితే మార్క్సిస్టు సూత్రాలప్రకారం అన్ని జీవితరంగాలలోను ఏర్పడే దృక్పథాలను గురించి సమగ్ర చర్చజరిగిఉండడంవల్ల అవి సులభంగా తెలుసుకోడానికి వీలేర్పడుతున్నది

మశ్రూవాలా ఆవిధంగా కళాది వివిధరంగాలలో ఏర్పడే గాంధీ దృక్పథాలను గురించి ఈ పుస్తకంలో వివరంగా చర్చించి ఉంచలేదు—పైగా ఈ పుస్తకంలో మార్క్సిజం ఒక సుస్థిరమైన దృక్పథంతో వివరించినట్టుకూడా కనబడుతుంది

ఈ పుస్తకం చదువుతూంటే చాలా చోట్ల తెలుగు హిందీ అనువాదంలా కనబడిపోతూంటుంది. అనువాదకులీ లోటు ముందు సంస్కరణలోనైనా సవరించుకోగలరని ఆశిస్తున్నాము

## జాతిరత్నాలు

[కథలసంపుటి]

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి, సుశీలవాడి, హుమాయత్ నగర్, హైదరాబాద్, (దక్కన్) వెల రూపాయిన్నర

ఆంధ్రదేశంలో సుప్రసిద్ధమయిన స్త్రీలపాటల లోని కొన్ని ఇతివృత్తాలు తీసుకుని శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు సరళగ్రాంథికభాషలో అయిదుకథలు వ్రాశారు ఈ ఆ అయిదు కథల సముచ్చయమే ఈ 'జాతిరత్నాలు'

ఆంధ్రదేశీయమైన ప్రాచీన జానపద మహిళా సారస్వతంలో చక్కని జాతిరత్నాలున్నా, అవి ఇంతవరకు అచ్చుతప్పుల తడకలుగా వెలిసిన గుజిలీ పుస్తకాలలోనే నామ మాత్రంగా మిగిలి ఉన్నాయి వీటినిగురించిన పరిశోధన చాలా స్వల్పంగా జరిగింది చింతాదీక్షితులుగారు మొదలైనవారొకరో ఇద్దరు ముగ్గురు మాత్రమే వీటినిగురించి కూలంకషమైన పరిశ్రమచేసి వ్యాసాల ప్రచురించారు.

శ్రీ సరస్వతీదేవిగారు పాత పాటలలోనించి ఎన్నుకొన్న ఈ అయిదు ఇతివృత్తాలలోను చక్కని

ఆంధ్రదేశీయమైన సంప్రదాయం తొణికిసలాడు తున్నది. వీరు స్వీకరించిన, యుధిష్ఠిరాదివిరుద్ర, లక్ష్మణదేవరనవ్వు, సర్వాంగదచరిత్ర, ధర్మరాజు జూదము, సత్యభామ సరసము, సుప్రసిద్ధమైనవి

శ్రీమతి సరస్వతీదేవిగారీ కథలన్నీ గ్రాంధి కంలోనే వ్రాసినా—కథలలో చాలాచోట్ల ఆయా పాటలలోని ఘట్టాలెన్నో ఉదాహరించారు ఈ ఉదాహరణవల్ల, సహజమైన కథ చాతుర్యంవల్ల ఇవి చదువుతూంటే—ఆ పాత పాటలు చదువు తూన్నట్లే ఉంటుంది ఈ పాటల పారశ్యము, కథా కథనవైఖరి కొన్ని కొన్ని చోట్ల ఉత్తమ కవితా స్థాయి స్ఫురింపజేస్తాయి లక్ష్మణదేవర నవ్వులో నిద్రాదేవి తన్నుగురించి చెప్పేమాటలు దీనికి ఉదా హరణగా తీసుకోవచ్చును

"అష్టదిగ్గజములను – ఆది మహాఋషుల
వైకుంఠవాసులను వసియింతు నేను
సప్తసాగరముల చవుటి పడియలను
కాలేటినదులను భ్రమియింతు నేను
పక్షుల జాతులను పర్వతమ్ములను
వృక్షాలపైనుండి విహరింతు నేను
నరుల నెవ్వారును నను గెల్వలేరు"

ఈ కథలు చదువుతూంటే సహజంగా పాఠకు లకు వీటికి సంబంధించిన పాతపాటలు చదవాలనే కుతూహలం కూడా కలుగుతూంటుంది

ఇల్లిందల సరస్వతీదేవిగారి 'జాతిరత్నాలు' అనే నీతి కథాభిమానులేగాక ప్రాచీన జానపద మహిళా వాఙ్మయాభిమానులు కూడా తప్పక చదవతగినవీ పుస్తకం ఈ రచయిత్రి క్రమంగా ఉత్తమమైన ప్రాచీన స్త్రీ సారస్వతంకూడా ప్రకటింపగలరనీ, అజ్ఞానంగా మరుగున పడిపోతున్న ప్రాచీన మహిళా వాఙ్మయమాధుర్యం తెలుగువారికి అందించగలరనీ ఆశిస్తున్నాను—

ఈ గ్రంథానికి శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసిన పీఠిక వారి విశేష పాండిత్యానికి నికషో పలంగా ఉన్నది

---

## వి జ య ద శ మి

### [పదికథల సంపుటి]

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ప్రకాశకు : కొండుబుక్ డిపో, రాజమండ్రి. వెల రూపాయిపావలా దీనిలో విజయదశమి, నలుగురీసలు, మానసుందరి మొదలైన పది కథలున్నాయి ఇవి అన్నీ ఇది వరకు సుప్రసిద్ధపత్రికలలో ప్రకటింపబడినవే అని పీఠికారచయితలు శ్రీదేవరపల్లి కేశవరావుగారు వ్రాస్తున్నారు.

వీటిలో ఎక్కువగా కూలివాలి చేసుకొని జీవించే బీదజనం, మధ్యతరగతి ప్రజ, పాత్రలుగా వస్తారు

ఈ రచయితలో చక్కని కథనశక్తి ఉన్నది జాతీయము, సుసంస్కృతము అయిన చురుకైన వ్యావహారిక భాషకూడా వీరి కథనశక్తికి తోడై కథలన్నీ ఒక గుక్కలో చదివించివేస్తుంది

అయితే చాలావరకీ కథలన్నిటిలోను రచ యిత వ్యక్తిత్వం మాటిమాటికీ పాఠకులకు అడ్డు తగులుతూ ఉంటుంది ఒక్కొక్కప్పుడు పాత్ర సంభాషణలు మొదలైనవన్నీ రచయితముఖతః బయలువెడుతున్నట్లే వినిపిస్తాయి మరీఅడుగున పడిపోయిన వ్యక్తులవర్ణనలో రచయిత వారి జీవి తాలనుగూర్చి ఊహించి చిత్రిస్తున్నట్లు కనిపిస్తుంది

ఈకథలన్నిటిలోను 'నలుగురీసలు' 'బస్సులో' అనేవి రెండు చాలా మంచికథలు పుస్తక ముద్ర ణాదికం ప్రశస్తంగా ఉన్నది

---

## శ్రీమద్రామాయణోత్తరకాండ

### [కవిత]

దేవళ్ల కృష్ణరాయాచార్యులు కోటిపల్లి, రాజోలు తాలూకా, వెల 3 రూపాయలు

ఈ రచయిత పొలం దున్నుతూండగా ఒక నిక్షేపం దొరికిందట! ఆ నిక్షేపంలో ఒక సంస్కృత తాళపత్రగ్రంథం మాత్రమే కనిపించినది ఆ గ్రంథం లోని కథ ఆధారంగా తీసుకుని రచయిత ఈ పద్య కావ్యం రచించారు దీనిలోని కథకు ఉత్తరకాండ కథకు అక్కడక్కడ కొన్ని భేదాలున్నాయి

ఈ రచయిత కావ్యం సాంప్రదాయక కవితా మార్గంలో నడిచిపోతుంది పద్యాలలోని సంస్కృ తాంధ్ర పదప్రయోగాల శిష్టత ప్రత్యేకంగా ప్రశం సింపదగినది కవిత అంతా కథాకథన ధోరణిలో సాధారణస్థాయిల్లోనే నడిచిపోతుంది గాని రసవత్తర ఘట్టాలలో తీవ్రమనుభవమైన కవితాగాంభీర్యం గాని కవితలో ప్రత్యేకత గాని కనబడవు

ఈ క్రింది పద్యాలు వీరి శైలికి ఉదాహర ణలుగా తీసుకోవచ్చును ఇది తృణబిందాశ్రమవర్ణన ఘట్టము

"కవ్వున కేక వేయుదురు,
కీరములౌ మయూరకారికల్
జవ్వన రేగిపాలు, కెలరేగియు
దేవియలాను ధుండు ఘా

జవ్వని తెల్ల బర్వలిడి
  జంటలు జంటలు గుంపు గూడియున్
గ్రొవ్విరులున్ ఫలమ్ములాగి
  -గోపికయు తేనె విలాసినుల్ మొగిన్ ”
పున్నాగ పుష్పముల్ పుడికి సేసలుజల్లి
  సరసమ్ములాడెడు సఖియ యొకతె
సన్నజాజులు కోసి సరులు సక్కగజేసి
  ముదితకొప్పున గూర్చు ముగుద యొకతె
మందార దామమీ మగువకు నగు
  నని పైచినగు జగ వనిత యొకతె
బిబ్బోకవతి నీదు చిగురుబ్బులకు బోని
  గజనిమ్మపండ్లని కవియు నొకతె
చివురు జొంపమ్ములం దుమ్మ తెల్వరయొర్తు
పాదయలం దాగి తలరెత్తు పొలతి యొర్తు
దాగుమూతల యాటాడి దయ్యునొర్తు
రమణు లిట్లు క్రీడించిరి రాముముందు ”

---

## భి క్షా వ తి

[కవిత]

వజ్జల కాళిదాసు ప్రతులకు జం షెడ్ పూర్ — టీహార్ వెల రూపాయిన్నర ఇది పద్యాత్మకమైన చిన్న ఖండకావ్యం భిక్షావతి అనే పేరు బిచ్చగత్తె అన్న పదానికి సంస్కృతానువాదంలా కనిపిస్తుంది బిచ్చగత్తె అన్న పదానికి తెలుగులో బిచ్చమెత్తుకొని జీవించే స్త్రీ అని అర్థం చెప్పవచ్చును కాని సంస్కృతంలో దీనికి ఈ అర్థం చెప్పడానికి వీలులేదు ఒకవేళ ఏదో ఒక అర్థం చెప్పదలచినట్టే 'భిక్షముకలది' అనేఅర్థమే చెప్పాలి ఈ ఖండకావ్యంలో ఒక బిచ్చగత్తెదౌర్భాగ్య జీవితమే కథా వస్తువు ఎంతఅడిగినా అన్నంపెట్టే వాళ్లు లేక ఈబిచ్చగత్తె చచ్చిపోతుంది దీనికి పూర్వం ఆమె శిశువుకూడా చనిపోతుంది ఇందుచేత ఈపేరు కావ్యానికి సార్థకంగా కనిపించదు సంస్కృత వ్యాకరణంప్రకారం 'భిక్షము కలిగినది' అనే అర్థంలో ఈపదం ఎలాగో అలాగ సాధించవచ్చునుగాని, ఆ భాషలో ఇది జాతీయమయిన ప్రయోగం కాజాలదు

బిచ్చగత్తె జీవితం వర్ణ్యమయినపుడు పాఠకులకు సహజంగా కరుణరసస్ఫూర్తి కలగాలి కాని ఈ కావ్యం చదువుతూంటే జీవితపు వేదాలమాటున కరుణరసంఅడుగంటిపోతూన్నట్టనిపిస్తుంది.

అయితే రచయిత కవనంలో అక్కడక్కడ చిన్నచిన్న దృశ్యఖట్టాలు హృద్యంగా కళ్లకుకట్టే శక్తికనిపిస్తుంది కావ్యంలో నాలుగేళ్లు నిండని పసిబాలిక తనచేతనున్న పళ్లు బిచ్చగత్తెకు ఇవ్వడం కోసం ఆమె దగ్గరకు వస్తుంది. ఆ పసిబాలికను వర్ణించే ఈ క్రింది సీసంలో రచయిత వర్ణనశక్తి పరిశీలించవచ్చును

చివురుపాదములపై చిన్నారి వెండి ము
  వ్వలు ముద్దుగా ఘల్లుఘల్లుమనగ
మొలత్రాడునన్ త్రేలు మురిపెంపుబంగారు
  బిళ్ల క్రొంబసుపు పై వెలుగులీన
శ్రీకారములబోలు చెవులకు నీలాల
  లోలకుల్ క్రొత్త యందాల నీయ,
నర్ధచంద్రాకృతి నలరారునుదుటిపై
  నందారుబొట్టు విన్యాసమమర,
నంగరాలకురులదాల్చి యున్న పూలు
రంగురంగుల క్రొత్త సౌరభములీన,
నాలుగేండ్లు నిండని పసిబాలయొకతె
వారికడనిల్చె కరుణావతారమనగ

---

## పునస్సంధానము

[పద్యకావ్యము]

పి రామయ్య బి ఏ (ఆనర్సు) ప్రతులకు ఆంధ్రా బుక్ హౌస్, బాలయ్య మార్కెట్, గుంటూరు వెల లేదు

ఇది సలీము నూర్జహానుల ప్రణయపరిణామం వర్ణించే కావ్యము సలీము నూర్జహాను భర్తను చంపించి ఆమెను వివాహమాడిన కథ చరిత్రప్రసిద్ధమే

అయితే ఈ కావ్యంలో నూర్జహానుభర్తను వధించిన సలీమును అనేక విధాలుగా దుర్భాషలాడి నిందిస్తుంది తరవాత సలీము తా నామెను చిన్నప్పటి నించీ ప్రేమించిన విషయం తెలియజేస్తాడు — అయినా ఆమె అతని మాటలు చెవినిపెట్టదు కాని అతడు ఆత్మహత్య చేసుకోబోయేసరికి ఆమె మెత్తబడుతుంది

చరిత్రమాట ఎలాగఉన్నా కావ్యంలో వర్ణించిన తీరుమాత్రం వీరి ఇద్దరికి సముచితంగా లేదు నూర్జహాను చివరికి సలీమును వివాహం చేసుకున్నది. తరవాత నూర్జహానే భారత సామ్రాజ్యభారం నిర్వహించినదని కూడా చరిత్ర చెబుతున్నది ' చరిత్రప్రసిద్ధమైన ఈ ఇతివృత్తానికి అనుకూలంగా నూర్జ

Printed & published by S Sambhu Prasad at the Andhra Patrika Press, No 7, Thambu Chetty Street, Madras. Editor S Sambhu Prasad



# ఆనందమయమైన గృహజీవనం

అతని ముఖం ఆనందముతో ప్రకాశిస్తున్నది. ఆమె ప్రేమతో తయారు చేసిన 'టీ' ఒక గ్లాసు త్రాగడం అప్పుడే ముగించాడు. పగలల్లా ఆఫీసులో పనివల్ల వచ్చిన అలసట పూర్తిగా అదృశ్యమైపోయినది. ఇక ఇప్పుడు అతడు చేయవలసినది కులాసాగా భార్యతో కబుర్లు చెప్పడం పిల్లలతో ఆడుకోవడం.

ప్రతిసాయంత్రమూ ఒక గ్లాసుడు 'టీ'తో భర్తను ఆహ్వానించి అతనిని ఆమె సేద దీరుస్తుంది. సుఖమయమైన సంసార జీవనం గడపడానికి అతనికి అంతకంటే ఏం కావాలి? ఉల్లాసాన్నిచ్చే మంచి టీ తయారు చేయడం ఎంత సులభం! ఇక ఖర్చు విషయమా అతి స్వల్పం. వ్యవధికూడ ఎక్కువ అక్కరలేదు.

సేద దీర్చే రుచికరమైన 'టీ'ని ప్రతి రోజూ త్రాగండి.

## మంత్ర శక్తి నిచ్చే పానీయం
## "టీ" త్రాగండి



సెంట్రల్ టీ బోర్డువారివల్ల ప్రచురింపబడినది.